శ్రీరస్తు.




శ్రీగురుభ్యోనమః

# జగన్నాటకవిలాసము



అనగా

శ్రీవేమనయోగి విరచిత

శుద్ధాంధ్రవేదంబునకు సూత్రభాష్యము.



ఇది

ఆచంటపురసముద్భవుండగు

శ్రీగవరాజు సూర్యనారాయణశర్మచే

రచియింపబడి, సర్వమత సమ్మతమగునట్లు

ప్రకటింపబడుచున్నది.



మొదటికూర్పు 500.

కాకినాడ

సి. హెచ్చి. కైలాసరావు బ్రదర్సువారి

కమలా ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1914

# పీఠిక

లోకంబున మోక్షగ్రంథంబు లనేకంబులు జగత్ప్రసిద్ధంబులై యున్నవి. వానిలో జగద్గురుండైన శ్రీశంకరాచార్య కృతంబులగు మహాభాష్య గ్రంథంబుల నంతంబులై యున్నను యవి సంస్కృతభాషలో నుండుటవలన ఆంధ్రభాషీయుల కుపయోగించుటలేదు. శ్రీవేమన యోగీంద్రుండను మహానుభావుండు భూలోకంబున నవతరించి బ్రహ్మవిద్యను సాధిరచి బ్రహ్మానంద సుఖంబును తాననుభవించి ‶స్వయం తీర్ణః పరాంతారయతి″ యను న్యాయంబున తాను తరించి, లోకంబును తరింపజేయుటకై తన బ్రహ్మవిద్యానుభవంబంతయును నూటికొకమాటయన్నట్లు మాటకొకపద్యమువంతున లెక్కలేనిపద్యంబులు ఆంధ్రభాషయందు రచియించి బ్రహ్మసూత్రములుగ ప్రకటించి యున్నాడు. ఇట్లు భూలోకకల్పవృక్షమువలె వెలసియున్న ఆంధ్రవేదముకు అంతరార్థము గర్భీకృతమై యొకపద్యంబున కనేకభావంబులు గన్పించుటవలనను, యాపద్యంబులు బ్రహ్మవిద్యకు వరుసక్రమముగా నేర్పడకుండుటవలనను, యీగ్రంథము ముముక్షువుల కుపయుక్తము లేక వ్యర్థముగా నున్నట్లు గనుపించుటవలనను నేనీయాంధ్రవేదంబునకు సూత్రభాష్యంబు రచియించినయెడల యిదిముముక్షు జనకల్పవృక్షంబై జీవన్ముక్తిఫలంబనాయాసముగా పొందిరనని నిశ్చయించి సద్గురుప్రసాదలబ్ధంబైన బ్రహ్మవిద్యానుభవంబును మదీయస్వానుభవ పూర్వకముగా ప్రకటించుచున్నాడను.

యెట్లంటే నేను యిరువది సంవత్సరముల ప్రాయంబున మోక్షాసక్తుండనై అనేకమోక్షగ్రంథంబులు చదివినను బ్రహ్మవిద్యానుభ

వ రహస్యమెందువలనను తెలియబడక అత్యాతుర ముముక్షుండనై ప
ఠితపించుచున్న కొంత కాలంబున శ్రీవేమనశతకమందు .. క॥ శతసంఖ్య
పద్యములనే మతిమంతుడు పఠనసేయు మమతలుదీరన్ । అతడును
శాశ్వతపదమును శితికంఠుని కరుణవడయు సిద్ధము వేమా॥ అను నీపద్యర
త్నంబు జ్ఞానరత్నంబుగా గనుపించిన అది జ్ఞానోపదేశముగా గ్రహిం
చి, యమ్మహానుభావుని సద్గురువని నిశ్చయించి, యాగ్రంథమునందలి
నూరుపద్యంబులను గ్రహించి యిట్లు మూడు సంవత్సరములు తదేకభ
క్తితో పఠింపుచున్న నాకు పరమగురుని యనుగ్రహంబు నాహృద్గతం
బై యుద్భవించి యాపద్యంబులకంత రార్థంబు ప్రకటింపందొడంగిన నే
నప్పటినుండి విదేహకైవల్యము, అనుభవదర్పణము, సతీపతిహితోపదేశ
ము, అను నీమోక్షగ్రంథములు స్వానుభవపూర్వకంబున రచియించి
లోకంబున ప్రకటించుచుండగా యిప్పటికేబదియారువత్సరంబులు గ
డచిన నమ్మహానుభావుని కరుణాకటాక్షంబున నూరుపద్యంబుల కర్థ
తాత్పర్యంబు లిఖింపవలెనని సంకల్పంబు జనించిన జగన్నాటక విలాస
మను నీగ్రంథమును రచియించి స్వానుభవ గోచరమైనంతవరకు యా
పద్యంబులకంతరార్థంబు తేట తెనుగు మాటలతో వివరించి బ్ర
హ్మవిద్యానుభవంబంతయు యిందుమూలముగా ప్రకటించుచుంటిం
గావున, లోకంబున ముముక్షువులైన బుద్ధిమంతులు బ్రహ్మసూత్రంబు
లైన యీవేమనపద్యంబులను పఠించి సూత్రభాష్యంబైన యనుభ
వార్థమును గ్రహించిన శ్రీవేమనయోగీంద్రుండు సద్గురు రూపంబున
ప్రసన్నుండై మోక్షసామ్రాజ్యంబును పొందించుచున్నాడని తా॥

# ఉపోద్ఘాతము

క॥ ఈకపటనాటకంబును
యీకపటపు చదువులన్ని • యింపుదలిర్పన్
యేకపటాత్ముడు జేసెనో
యాకపటాత్మునకు మొ్రక్కు • లిడరావేమా॥

తా॥ ఇమ్మహేంద్రజాలిక మాయాకల్పిత బ్రహ్మాండ కటాహం బైన యీజగన్నాటకంబు, యేకపటనాటక సూత్రధారివలన వినోదింపబడుచున్నదో అట్టిసర్వేశ్వరునకు అనేక మంగళాచరణంబులుస భక్తిపూర్వకముగా సమర్పించుచున్నానని గ్రంథకర్త యభిప్రాయము.

జగన్నాటక విలాసమనగా, లోకంబున మానవులు వినోదంబు కొరకు భారతభాగవతాది పురాణకథావృత్తాంతంబులను గ్రహించి అందుల కనుగుణ్యంబైన వేషభాషలనభ్యసించి, తత్కథావృత్తాంతంబులు ప్రత్యక్ష గోచర మగునట్లు నాట్యనాటక వినోదంబులు సర్వజనాహ్లాదంబుగ ప్రదర్శింపుచున్నారు. నాటకము వినుపించుటకు మేళనాయకుడైన సూత్రధారి నానాలంకారమైన యొకనాటకశాలను నిర్మించి చిత్రవిచిత్రంబులైన తెరలచే నంతరంగ బహిరంగంబులను గల్పించి సూత్రధారియైనతానంతరంగ స్థానంబుననుండి తత్కథావృత్తాంబులకు తగినవేషంబుల నలంకరించి యావేషంబులను సమయోచితంబుగ సభాస్థానంబునకు పంపించుచున్నాడు.

ఆవేషధారులు నాట్యరంగంబైన సభాస్థానంబున కేతెంచి తమతమ వేషభాషల వృత్తాంతంబులు సరససల్లాపంబులతో ప్రసంగింపుచు నేనుశ్రీరాముండను నేనుసీతాదేవిని నేనుహనుమంతుడను నేనురావణుండను నేనునారదుండను. అనితమతమ మాయవేషంబుల చాతుర్యం

బులు వీరరౌద్రాది రసంబు లుద్భవించునట్లు సభారంజకంబుగా నటింపుచు తమ వేషంబులవనితీరిన యావేషధారులు యథాక్రమంబుగ తెరచాటునకుంబోయి యామాయవేషమును విసర్జించి మరియొక మాయవేషమును ధరించి మరల బహిరంగంబున కరుదెంచుచున్నారు. కాని సూత్రధారిమాత్రము తానంతరంగంబుననేయుండి అఖలవినోదములను గ్రహించుచున్నాడు.

అటువలెనే జగన్నాథుండైన భగవంతుండు బ్రహ్మాండకటాహంబైన యీజగన్నాటకమును గల్పించి యిందుకుతగినలోకంబులను లోకస్థులను లోకేశులను నిర్మించి నానావిధనామరూపచర్మపత్రిమంబులైన మాయవేషంబులను మాయావరణంబులలోనుంచి జాగ్రత్ప్రపంచంబైన జగన్నాటకశాలకు పంపించి నర, మృగ, పశు, పక్ష్యాది నానావిచిత్ర రూపంబుల నాడింపుచు సూత్రధారియైనతాను మాయాతీతుండై తురీయాంతరంగంబుననుండి ముక్తికాంతా విలాసంబున బ్రహ్మానందరతిక్రీడా వినోదంబు సలుపుచు అవాఙ్మనస గోచరుడై వేషధారులకు తానగుపించకుండుటవలన జగత్కర్తయైన భగవంతుండు కపటనాటకసూత్రధారియనిన్ని భగవన్మాయా కల్పితులైన జగజ్జీవులు కపటనాటక వేషధారులనిన్ని ఇట్టి జీవేశ్వర మాయావిలాసము జగన్నాటక విలాసమనిన్ని చెప్పబడుచున్నది.

ఇట్టిజగన్నాటక వేషంబులలో వివేకశక్తిగల మానుషవేషంబులు స్త్రీపురుషరూపంబులు ధరించి జాగ్రత్స్వప్న సుషుప్తి రూపంబైన మాయావరణంబులలో ప్రవేశించి జాగ్రత్ప్రపంచంబైన నాట్యరంగంబున కేతెంచి రాజస తామసాది గుణంబులచే దేవ మానవ రాక్షస గణంబుల ననుసరించి కామ క్రోధాది యహంకార మమకారంబులగు మాయావికారంబులచే పరస్పరమోహితులై జిహ్వోపస్థాది విష

యభోగంబులచే స్వస్వరూప విస్మృతిం జెంది మాయాకల్పిత మలమూత్ర శరీరంబులు తమనిజరూపంబులుగా భ్రమించి, సూత్రధారియైన అంతర్యామిని స్వప్నమం దైనను దలంపక స్వప్నతుల్యంబైన సంసారంబునమిత్ర అర్థప్రాణంబు లాచార్యాధీనంబులనునట్లు తమ ఆయుర్భాగ్యంబు దారాపుత్ర సంసారంబునకు ధారబోసి, అంత్యకాలం బాసన్నంబైన తమ తమ మాయవేషంబులైన మలమూత్ర దేహంబులను వదలలేక వదలలేక తుదకు మాయజీవులు మఱుమాయనుగు చున్నారు.

ఇట్లుమాయజీవులను బుట్టించి కామయంత్రంబులను గల్పించి, కర్మసూత్రంబులను బంధించి యీజగన్నాటకము నాడించుచున్నవాడు దేవుడా? దేవునిమాయయా? యని విచారించిన "ఇంద్రజాల మిదంవిశ్వం। విష్ణుమాయాప్రకల్పితం" అన్నట్లు సర్వశక్తియైన యీశ్వర మాయ జగన్మోహనాకారమై త్రిమూర్తులను బుట్టించి సర్వలోకములును తానై ప్రకాశించుటవలన సూత్రధారియనగా లోకంబున గారడివాడు తనమాయవిద్యవలన యింద్రజాలకుడైనట్లు నిర్వికారుడైన బ్రహ్మమును జడప్రకృతియైనమాయయును కూడినందున మాయావశీకృతుడైన భగవంతుడే జగన్నాటక సూత్రధారియని చెప్పబడు చున్నది. కాబట్టి జగన్నాటకసూత్రధారియైన భగవంతుని మహిమాతిశయములను లోకంబున కల్పవృక్షమువలె వ్యాపింపజేయుటకు శ్రీవేమనయోగీంద్రుండను మహానుభావుండవతరించి జగన్నాటక విలాసమంతయును సమర్మకముగా వివరించుచున్నాడని తాత్పర్యము.

రగడ॥ వేదాతీతుడు వేమననుండీ
వేమన చెప్పెను వేదమునుండీ
వేదశాస్త్రములు వాదులునుండీ
వాదులనోటను బూడిదనుండీ

వినువక చదివిన విందురుసుండీ
విన్నవారు మరికందురుసుండీ
కన్నవారు మరి చెప్పరుసుండీ
చెప్పినయెవ్వరు సేయరుసుండీ
చేశినవారే సిద్ధులు సుండీ
సిద్ధులమాట ప్రసిద్ధముసుండీ
జాతర, జాతర, జాతర సుండీ
జాతరతీతుడు వేమనసుండీ॥

తా॥ లోకంబున వేమనయోగియను బ్రహ్మవేత్త బ్రహ్మవిద్య వలన జీవన్ముక్తిని పొంది బ్రహ్మస్వరూపుడై ప్రకాశించుచున్నాడని న్ని ఆబ్రహ్మవేత్తయొక్క యీస్వానుభూతి వాక్యములు వేదసారంబై న బ్రహ్మసూత్రంబులనిన్ని, వేదశాస్త్రప్రసంగములన్నియును వివాద రూపంబులనిన్ని అట్టివాగ్వాదంబులచేత మృత్యుబాధ నివర్తించదనిన్ని బ్రహ్మసూత్రంబులైన యీవేమనపద్యంబులు భక్తితో పఠించిన దేవు నిగుట్టు తెలియబడుననిన్ని అట్లుదేవునిమాయ తెలిసినవారు దేవునిచూ చుచుందురనిన్ని అట్లుదేవుని చూచినవారుఆదేవరహస్యమును భక్తిహీ నులకు చెప్పరనిన్ని ఒకవేళదయచే చెప్పినను చెప్పినట్లుచేయరనిన్ని గు రువుచెప్పినట్లు చేసినవారికి దేవుడు తప్పక కనుపించుననిన్ని అట్లుదేవు ని దర్శించిన బ్రహ్మవేత్తల స్వానుభవము లోకంబున గ్రంథరూపము గా ప్రసిద్ధమై యుండుటవలన యీజగన్నాటకము అమ్మవారి జాతర వలె వట్టి మాయబూటకమై యున్నదనిన్ని యీమాయ బూటకమగు జగన్నాటక మర్మమును గుర్తెరిగిన వేమనయోగి మాయాతీతుడైన సూత్రధారి తానై ప్రకాశించుచున్నాడనిన్ని తాత్పర్యము.

అమ్మవారి జాతరయనగా గ్రామంబున విశూచి మశూచి మొ

దట్టైన వాద్యంబులు ప్రకోపించి నప్పుడు అమ్మవారి జాతరయని ఒక మట్టికుండను తెచ్చి దానిని గ్రామదేవతగా నియమించి ఆఘటమునకు కుంకుమబొట్లు పెట్టి క్రొత్తకోకలుజుట్టి వేపతోరణములుకట్టి ఆయమ్మవారి ఘటమును ఆసాదివాని నెత్తినిబెట్టి బాజాభజంత్రీలతో గ్రామదేవతనూరేగించునపుడు గ్రామంబున మూఢజనులందరును ఆమట్టికుండమ్మవారిని జూచి మనగ్రామదేవతయైన యీపోలేరమ్మ గంగానమ్మకు చెల్లెలు ఇది మిక్కిలి సత్యముగలదేవత బహుపరాక్రమశాలి కనుక దుష్టమరిడీదేవతయైన యీదండుమారెమ్మను మనయూరినుండి తరిమి తరిమి పారదోలుచున్నది. ఈమహాశక్తి మనగ్రామంబున లేకుండిన యీమహమ్మారి పెద్దబ్రహ్మరాక్షసివలె ప్రజలనుబట్టి నాశనము చేయుచున్నదిగదా, మనగ్రామదేవతమూలముగా మనమందరము బ్రతికియుంటిమి గనుక మనయిష్టదేవతకు మనమేమిసమర్పించినను ఋణముతీరదు. అని యనేకవిధంబుల యామంటికుండమ్మవారిని కొనియాడి కొనియాడి మహానందమగ్నులై విలువగల కట్నంబులు కానుకలొసంగి అనేకంబులైన మృగంబుల నాహారంబుగా బలియిచ్చి యారాత్రి నాలుగుయామంబులు మహత్తరమైన ఉత్సవము చేయించిన యామూఢజన మనోభీష్టదాయినియగు యామంటికుండమ్మవారు యారాత్రి దేదీప్యమానంబుగ మహావైభవమును పొందుచున్నది. ఇట్లు మహోత్సవమును పొందిన ఆయమ్మవారు తెల్లవారినంతనె యెక్కడిజనులక్కడే అమ్మవారిని విడిచి పోయిన ఆసాదివాడు ఆమంటికుండమ్మవారిని తనయింటికి దెచ్చి తనభార్యవద్ద నుంచిన ఆయాసాదమ్మ యామంటికుండమ్మను తనచేతపట్టుకొని కట్నాలు కానుకలూడ తీసుకుని ఆయమ్మవారిని తనతూముకాలవలో పడవైచిన ఆఖరుకు అంట్లకుండమ్మవారై అధోగతిని బొందుచున్నది, అటువలెనె యీజగన్నాటక వేషంబులైన మాయాఘటంబుల వైభవంబంతయు మంటికుండ మహోత్సవమువలె మొట్టమొదట అత్యంతసంతోషముగా కను

పించినదంతయు తుదకత్యంత దుఃఖరూపమై క్షణమాత్రములో నశిం
చుచున్నది.

కాబట్టి జగన్నాటక వేషధారులైన మానవులు యీ దేహేం
ద్రియాది ప్రపంచమంతయు యిందజాలమువలె మాయాకల్పితమని
గ్రహించి యీ జగన్నాటక సూత్రధారియైన భగవంతుని యీ జన్మ
మందే దర్శింపవలెనని సద్గురువు శిష్యునకు నుపదేశించినట్లు శ్రీ వేమన
యోగి తనబ్రహ్మవిద్యానుభవమును పద్యకావ్యముగా ప్రకటించు
చున్నాడని తాత్పర్యము.

ఆ. శ్రీకర శివతత్త్వ ♦ శీలుడౌ వేమన
ప్రాకటముగ జేయు ♦ పద్యములను
లోకజనులు జదివి ♦ లోవెలి బాయరో
విశ్వదాభిరామ ♦ వినుర వేమ॥

తా॥ లోకంబున మానవులు బ్రహ్మజ్ఞాన దురంధురుండైన శ్రీ
వేమన యోగీంద్రుండు తానురచించిన బ్రహ్మజ్ఞాన రత్నంబులైన ప
ద్యంబులను భక్తిపూర్వకముగ పఠించినయెడల మాయాకల్పిత శరీర
ములకు అంతర బాహ్యములందు వ్యాపించియున్న అజ్ఞానాంధకారము
ఆత్మజ్ఞానప్రకాశముచే అంతరించుచున్నదని తాత్పర్యము.

ఆ. వేయువిధములమర ♦ వేమన పద్యంబు
లర్థమిచ్చువాని ♦ నరసిచూడ
చూడ చూడగల్గు ♦ చోద్యమౌజ్ఞానంబు
విశ్వదాభిరామ ♦ వినుర వేమ॥

లోకంబున మానవులు బ్రహ్మవిద్యానుభవ సూత్రంబులైన
యీ వేమనపద్యంబులను ప్రజ్ఞావంతులై పరిశీలించిన, అనేక విధంబులైన
అంతరార్థంబులు కనుపించుననిన్ని ఆయర్థంబులను విజ్ఞానవంతులై
విమర్శించి చూచినకాలదిని అద్భుతమైన ఆత్మజ్ఞానము ఆత్మయందే ప్ర
కాశించుననిన్ని తాత్పర్యము.



శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః

# జగన్నాటకవిలాసము.



1. శివకవులకు నవకవులకు। శివభక్తికి తత్వమునకు ♦ చింతామణికిన్ । శివసాయుజ్యంబునకును । శివునకు గురువునకు శరణు ♦ జేయురవేమా॥ లోకంబున నవతరించిన వ్యాస వశిష్ఠ వాల్మీక శుక శౌనకాది ప్రాచీనకవులకున్ను శంకర కాళిదాసాది నవీనకవులకున్ను పరమేశ్వరభక్తికిన్ని పరబ్రహ్మతత్వమునకున్ను బ్రహ్మవిద్యకున్ను పరమపదమునకున్ను పరమేశ్వరునకున్ను పరమగురువునకున్ను నమస్కరించి గ్రంథప్రారంభము చేయబడుచున్నదని తాత్పర్యము॥

2. బ్రహ్మమొక్కటయ్యు ♦ బహురూపులైతోచు। ప్రకృతియందుతాను ♦ ప్రతిఫలించి । సారిదిజలఘటమున ♦ సూర్యునిచందంబు ॥వి॥ లోకంబున సూర్యబింబమొక్కటియై అనేకజలఘటంబులయందు ప్రతిబింబించి అనేక సూర్యులుగా కనుపించుచున్నట్లు పరబ్రహ్మమైన దేవుడొక్కడే నర మృగ పశుపక్ష్యాది నానారూపంబులుగా తోచబడుచున్నాడని యర్థము. అది యెట్లాటే అకల్పిత స్వయంవ్యక్తమైన ఆదిపరబ్రహ్మమునందు అనాదిమాయాశక్తివలన ప్రకృతిపురుషులును, జీవేశ్వరులును, దేహాత్మలును, దేశకాలములును, తలిదండ్రులును, సతీపతులున్ను, జననమరణములును, జాతిమతములును, ఇహపరములును,

ధ్యేరకమరుపులును, ధర్మకర్మములును, గురుశిష్యులును, జ్ఞానాజ్ఞానములును, భక్తిముక్తులును అనునివి లోకవిషయములున్ను; మనసు, తలపు, చూపు, ఆశ, కపటము, చదువు, సంసారము, సన్యాసము, బ్రహ్మవిద్య, రాజయోగము అనునివి దేహవిషయములున్ను; స్వర్ణమందాభరణములవలె కల్పితమై సముద్రమందు తరంగములవలె లభించుచున్నవి.

కాబట్టి లోకంబున దేహధారులైన జీవులందరును పరబ్రహ్మముయొక్క ప్రతిబింబములని గ్రహించి మాయాభ్రమములను భేదించి బ్రహ్మస్వరూపులై ప్రకాశించవలెనని వేదాంత సిద్ధాంతతాత్పర్యము.

3. బయలు బ్రహ్మమనుచు భ్రమసేసు కలినరులు। బయలు శూన్యమైన బ్రహ్మమగునె। బ్రహ్మమైన బయలు పరమాత్మలోనుండు॥

వి॥ బయలనగా జడభూతమైన ఆకాశమున్ను బ్రహ్మమనగా చైతన్యస్వరూపమైన ఆత్మయున్ను అర్థముగాని బయలు బ్రహ్మమని బ్రహ్మము బయలని అర్థముకాదు. ప్రమాణమేమంటే "ఆకాశం గగనం శూన్యం" అన్నట్లు బయలనగా ఆకాశభూతమైనదిన్ని సర్వశూన్యమైనదిన్ని "యద్దృశ్యం తన్నశ్యం" అన్నట్లు దృశ్యరూపమైనదిన్ని మిథ్యాభూతమైనదిన్ని "యా మా సా మాయా" అన్నట్లు మాయాస్వరూపమైనదిన్ని విచారించితే లేనిదిన్ని అయినందున బయలు బ్రహ్మముగాదు, బ్రహ్మమనగా "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను శ్రుతి ప్రమాణంబున, సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము, నిత్యము, నిర్మలము యీ లక్షణములుగలదిన్ని సత్యమనగా సర్వప్రపంచ సృష్టికిని అధిష్ఠానమైనదిన్ని జ్ఞానమనగా సర్వలోకవిషయములకున్ను నధిష్ఠానమైనదిన్ని ఆనందమనగా సర్వవిషయానుభవములకున్ను అధిష్ఠానమయినదిన్ని అయినందున "దృగ్బ్రహ్మ దృశ్యం మాయేతి" అన్నట్లు దృశ్య

రూపమైన బయలు మాయనిన్ని దృగ్రూపమైన ఆత్మే బ్రహ్మమనిన్ని శ్రుతియుక్తిదృష్టాంతములచే స్పష్టమైనందున లోకంబునయందున్నవారైన మానవులు "ఆకాశస్యగుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే" అన్నట్లు తానైన ఆత్మయే బ్రహ్మముగాని తానుగాని ఆకాశబయలు బ్రహ్మముగాదనిన్ని, సర్వమును తెలుసుకునేది బ్రహ్మముగానితనచే తెలియబడేది బ్రహ్మముగాదనిన్ని; స్వప్రకాశమైనది బ్రహ్మముగాని అప్రకాశమైనదిబ్రహ్మముగాదనిన్ని; సర్వపరిపూర్ణమైనది బ్రహ్మముగాని సర్వశూన్యమైనది బ్రహ్మముగాదనిన్ని, నిశ్చయించి సనాతన సహజాద్వైత సిద్ధాంతబ్రహ్మవిద్యానుభవమువలన తననిజరూపమే బ్రహ్మస్వరూపమని గురుముఖముగా గ్రహించి జీవన్ముక్తిని పొందవలెనుగాని మాయాకల్పితదుర్బోధవలన బయలు బ్రహ్మమని, అచల పరిపూర్ణమని, నిముషములోదొరకునని భ్రమించి మృత్యువు నోట పడవలదని తాత్పర్యము.

4. బ్రహ్మమేడననుచు • పలుమారుబలికేరు। బ్రహ్మమన్నిటందు • బరగియుండు। తన్నుతానెరిగిన • తానెపో బ్రహ్మంబు॥ వి॥ లోకంబున మానవులు తమశరీరమందున్న ఆత్మయే బ్రహ్మమని తెలియనేరక పరబ్రహ్మమైన దేవుడు వైకుంఠాది లోకంబులయందెక్కడనున్నాడోయని భ్రమించుచున్నారుగాని, యీనామరూపప్రపంచము సర్వము బ్రహ్మమువలననే ప్రకాశించుచున్నదని యెరుగుటలేదు. కాబట్టి దేహధారియైన జీవుండు తన్నుతాను విచారించిన సర్వాధిష్ఠాన పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మము తానే అయ్యున్నాడని తాత్పర్యము.

౫. పాలు పెరుగు నెయ్యి • పాయసాన్నము వెన్న। జున్నుమీగడైన • జూడ పాలె। పాలవంటికులము బ్రహ్మంబుగానరో॥ వి॥ లోకంబున పాలను పదార్థమొక్కటియే పెరుగుగాను వెన్నగాను నేయిగాను జు

న్నగాను మీగడగాను పాయసముగాను పరిణమించి అనేకరూపము లుగా నెట్లు కనుపించుచున్నదో అటువలెనే బ్రహ్మమను పదార్థ మొక్కటియే దేవతలుగాను మానవులుగాను మృగములుగాను పశువులుగాను పక్షులుగాను క్రిమికీటకాదులుగాను పరిణమించి విశ్వమయమై ప్రకాశించుచున్నది. కాబట్టి లోకంబున మానవులు పెరుగు నేయి మొదలైన వస్తువులను పాలయందు కల్పితములని గ్రహించినట్లు యీ స్థావరజంగమ రూపములన్నిటిని విమర్శించి సర్వము బ్రహ్మముగా గ్రహించవలెనని తాత్పర్యము.

## మాయ

6. ఇంద్రలోకమునగు నింద్రజాలంబనగ । నింద్రియంబులన గనిదిమాయ । కలియుగమున నరులు గానక భ్రమతురు ॥వి॥

మాయయనగా యీదేహేంద్రియాది దృశ్యప్రపంచరూపమైయున్నదే గాని మరియొకచోట లేదు. అదియెట్లంటే యింద్రియమనగా రేతస్సు ఆబిందువు స్త్రీగర్భమునందుండి చేతనత్వమునొంది విగ్రహరూపంబున మూర్తీభవించుటయు, యావిగ్రహము మాతృద్వారంబున జనియించుటయు, క్రమంబున బాల్య యవ్వన కౌమార వార్ధిక వేషంబులచే నటించుటయు, కృశించుటయు, తుదకు నశించుటయు, యిది యీశ్వర సృష్టిగను మాయయనగా లేనిప్రపంచమున్నట్లున్ను ఉన్న బ్రహ్మమును లేనట్లున్ను తోపించునది మహేంద్ర జాలమనిన్ని; ఇట్లుద్భవించిన మాయాజీవుడు మాయదేహము తానని భ్రమించి మాయశబ్దములు వినుటయు మాయరూపములు గనుటయు మాయవస్తువులు తినుటయు మాయతనువులతో కలియుటయు మాయమనస్సులో చిక్కుటయు తుదకు

మాయజీవుకు మటుమాయమై పోవుటయు యిదియవిద్య గనుక యిం
ద్రియములచే జేయబడుచున్న జీవసృష్టి యింద్రజాలమనిన్ని చెప్పబడు
చున్నది.

కాబట్టి ముముక్షువులైన మానవులు యింద్ర మహేంద్రజాల
రూపంబైనజగన్మాయను ఆత్మానాత్మవివేకంబున భేదించిజగద్భ్రాన్తి
ని తొలగించుకొనవలెనని తాత్పర్యము

7. సుప్తిజాగరములఁసొలపుల దానుండి। కప్పుకొన్నమాయఁ
గానలేక। దబ్బర నిజములనుఁతానులెన్నగ గనకగొబ్బునచెడిపోవుఁగు
ణముహేమా॥ అనగా లోకంబున దేహధారియైన జీవుండు అకల్పితస్వ
యంబ్రహ్మమైన ఆత్మతననిజరూపమనిన్ని ఆత్మశక్తియైన తన మూల
ప్రకృతి జాగ్రత్స్వప్నసుషుప్తిరూపంబై తన్నావరించి తనస్వరూపము
ను మరిపించుచున్నదనిన్ని విమర్శించి బ్రహ్మమైన తానుసత్యమని ప్ర
కృతియైన మాయను మిథ్యని గ్రహించనేరక మాయాకల్పిత దేహ
భ్రాన్తి చేమృత్యుసంసారంబున మునుగుచున్నాడని తాత్పర్యము.

8. సిగ్గుయేడదాగుఁచీకటేడనుదాగు। నాకలేడదాగుఁనాత్మ
లోన। దాగియున్న నిద్రఁదాగుట తెలియుడీ ॥వి॥

లోకంబున సూర్యప్రకాశము లేనప్పుడు కటికిచీకటి గాఢాం
ధకారమై కమ్ముకొనుచు సూర్యప్రకాశము కలిగి నామరూపములు
నశించి సూర్యుడస్తమించియున్నపుడు మాయచీకటి మటుమాయ మ
గుచున్నది. అటువలెనే యీ దేహస్థుడైన జీవుండు తాను సూర్యునివలె
స్వయంజ్యోతియై ప్రకాశించుచుండియును మాయాకల్పిత శరీరమం
దభిమానము ఆకలి, నిద్ర, మొదలయిన ప్రకృతి వికారములు సూర్యు
నియందు చీకటిదాగియున్నట్లు బ్రహ్మమైన తనయందే దాగియున్నవ

ని తెలియనేరక మాయావికారంబులు తనయందారోపించుకొని జన్మ
మృత్యుసంసార బంధములో జిక్కుచున్నారు. కాబట్టి లోకంబున
మానవులు ఆకలి, నిద్ర, భయ సంగమాదులు ఆత్మయందు మాయ
చే కల్పిత మగుచున్నవని గ్రహించుటయే మాయను జయించు
టయని తాత్పర్యము.

9. బ్రతుకెల్ల మాయ • భవబంధములు మాయ । తెలివిమా
య • తన్ను దెలియుమాయ । మాయదెలియు • వాడు మర్మజ్ఞుడగు యోగి॥
వి॥ లోకంబున మాయయనగా అశరీరుడైన ఆత్మ తాను దేహధారియై
జన్మించుటయు, జీవించుటయు చలించుటయు, కృశించుటయు, నశిం
చుటయు, యీమొదలైన ప్రకృతి వికారంబులు మాయాకల్పితంబులు
గాని కేవలాత్మయైన బ్రహ్మమునకు జననమరణంబులును, జ్ఞానాజ్ఞా
నంబులును. బంధమోక్షంబులును, లేనందున ముముక్షుడైన జీవుండు
దేహేంద్రియాది దృశ్యప్రపంచమే మాయాస్వరూపమని గ్రహించి
తన మనోమాయను తా నేదయించవలెనని తాత్పర్యము.

10. మొదటి తరువునందు • మూడుకొమ్మలుబుట్టె । ఆకుకొనలు
దీగె • లమరియుండె పూలుపిందెలన్ని • భువనముల్ నిండె రా ॥వి॥ అఖండ
సచ్చిదానంద బ్రహ్మమనే కల్పవృక్షమునందు అనాది మూలప్రకృతి
వలన సత్వరజస్తమోగుణంబులనే మూడుకొమ్మలు బుట్టి అంతఃకర
ణంబులనే ఆకులు మొలచి చిత్తవృత్తులనే చిగుళ్లు కలిగి ఇంద్రియవిష
యంబులనే తీగెలుబారి మన్మథవికారములనే పుష్పాలుబూచి రాగద్వే
షములనే కాయలుకాచి సుఖదుఃఖంబులనే పండ్లు ఫలించి చతుర్దశ
లోకములను వ్యాపించి బ్రహ్మాదులను మోహింపజేయునది పరబ్రహ్మ
శక్తియైన భగవన్మాయయే గనుక ముముక్షుండైన జీవుండు మాయా

మాత్రంబులో నిర్మాలమై యెటువత్తెనుటు మాయమగుచున్నదో అ టువలెనే అకల్పితస్వయంవ్యక్తమైన బ్రహ్మమందు అనాదిమాయవల న ప్రకృతి పురుషసంసార వృక్షము జనించి స్వప్నములో నంకురించి జాగ్రతలో పరిణమించి, సుషుప్తిలో నంతరించుచున్నది. కాబట్టి యీ సంసారవృక్షము మాయాకల్పితముగనుక, యీవృక్షమునకు అంకుర మైన బీజమున్ను మూలమైన జీవాహంకారమున్ను, శాఖలైన దేహేం ద్రియాదులును, పూలు పిందెలైన, దారాపుత్రాదులును, కాయలు పండ్లయిన సుఖదుఃఖంబులును, ఫలానుభవంబైన జన్మకర్మంబులును, భ్రాన్తికల్పితములై మిథ్యాభూతమైనందున జీవుని సంసారవృక్షము, బీ జములేనిదిన్ని మొదలులేనిదిన్ని, కొమ్మలులేనిదిన్ని, ఆకులు, పువ్వు లు, పిందెలు, కాయలు, పండ్లు, యేమియులేనిదిగనుక యీప్రకృతిపు రుష సంసారవృక్షమందు బ్రహ్మమైన జీవునకు యేఫలానుభవమున్ను లేదని తాత్పర్యము

13. అనఘ చిత్పురుషుడొక్కడు। వినుమన్యము లేదు తత్వ విధ మిట్టిదగుగా। తనసంకల్పమె బంధము। తనసంకల్ప క్షయంబు తత్వము వేమా॥ చిత్పురుషుడనగా; ఆదిపరబ్రహ్మమైన ఆత్మనిన్ని చిత్ప్రకృతి యనగా పరబ్రహ్మశక్తియైన మాయనిన్ని, యీప్రకృతి పురుషులిరు వురున్ను, అనాదిదంపతులనిన్ని చెప్పబడుచున్నది. సంకల్పరూపంబైన చిత్ప్రకృతిన్ని సాక్షిరూపంబైన చిత్పురుషున్ను ప్రతిశరీరమునందు క లిసియుండుటచేతనే నేను నేనని జీవయంత్రంబులు నటించుచున్నవి. కాబట్టి దేహధారియైన జీవుండు చిత్పురుషుడైన తనకు తనసంకల్పము వల్లనే జీవభ్రాన్తి సంభవించుచున్నదని గ్రహించి ప్రతిబంధరూపంబై న తనసంకల్పప్రకృతిని జయించి సాక్షిమాత్రుండై నిర్వికల్ప నిస్సంక ల్ప స్థితినుండుటయే నిర్గుణబ్రహ్మత్వమని తాత్పర్యము.

14. సకలాకారుడనంతుఁడు । సకలాత్మలయందు సర్వసాక్షియు డానై । సకలమున నిర్వికారుం। డకలంక స్థితిని బ్రహ్మము రా వేమా॥ అనగా అఖండ సచ్చిదానంద స్వరూపుండైన పరబ్రహ్మము అనాది మూలప్రకృతివలన మూర్తీభవించి నర మృగ పశు పక్ష్యాదిభేదంబుల జగన్మయుండై అనంతరూపంబులతో నటించుటవలన దేహాకృతిచేత సాకారుఁడున్ను, సర్వజీవయాత్రంబులలోను, సాక్షిమాత్రుఁడై ప్రకాశించుటవలన ఆత్మాకృతిచేత నిర్వికారుఁడున్ను తానే అయినందున దేహధారియైన జీవుండు దేహభావమునువిడచి ఆత్మభావమునుపొందిన అది పరబ్రహ్మము తానేయగుచున్నాడని తాత్పర్యము.

15. ఆత్మబుద్ధివలన సఖిలంబు దానయ్యె । జీవబుద్ధివలన జీవుడయ్యె। మోహబుద్ధిలయము ముందర గనుగొను॥వి॥ అనగా ఈదేహస్థుండైన పురుషుండు అనాదిమూలప్రకృతియైన అవిద్యచేత తననిజరూపమును మరచి, దేహము తాననే నిశ్చయబుద్ధివలన అవివేకియై జీవభ్రాన్తిని యెట్లుపొందుచున్నాడో, అటువలెనే, ఆత్మానాత్మవివేకముచేత, తన నిజరూపము తానెరిగి ఆత్మతాననే నిశ్చయబుద్ధివలన సర్వసాక్షియై ప్రకాశించుచున్నాడు. కాబట్టి దేహధారియైన జీవుండు దేహముతాననే మోహబుద్ధిని ఆత్మతాననే నిశ్చయబుద్ధిచేత తొలగించవలెనని తాత్పర్యము.

## జీవేశ్వరులు

16. ఘటముజలమునందు గగనంబు గనుపడు। ఘటముజలము లేమి గగనమేది। ఘటములోనజ్యోతి క్రమమున దెలియుడీ॥ వి॥ లోకంబున కుండయందు జలముండినపుడు ఆజలమందు మహాకాశము ప్రతిబింబించుచున్నది. యాకుండలోని జలము లేనప్పుడు యాప్రతిబింబ

ప్రకాశించుచున్నది. అటువలెనే యీశరీరమనే ఘటమందు జలమువంటి అంతఃకరణముండునప్పుడు పరమాత్మ ప్రతిబింబించి జీవుడై భాసించుచున్నాడు. ఆయంతఃకరణము ముకుళించిన సుషుప్తియందు ఆజీవాహంకారమంతరించి పరమాత్మ శేషించుచున్నది. కాబట్టి దేహధారియైనజీవుండు ప్రతిబింబాకాశమును మహాకాశముగా నెరిగినట్లు చిదాభాసజీవుని అధిష్ఠానబ్రహ్మముగా తెలియవలెనని తాత్పర్యము.

17. జీవమేదనుండు భావమెక్కడనుండు । కాపురంబు యెద గడిసియుండు । దనరుచున్న రెంటిస్థలమేల దెలియరో॥ వి॥ జీవమనగా ఆత్మయందు కల్పితమైన అహంకారముగనుక అది అంతఃకరణమందుండునదిన్ని, భావమనగా మనస్సునందు కల్పితమైన యిష్టముగనుక అది దేహేంద్రియములయందుండునదిన్ని, కాపురమనగా సంసారమందు కల్పితమైనదిగనుక అది దారాపుత్రులయందుండునదిన్ని, అగుటవలనజీవుండు దారాపుత్రసంసారము జాగ్రతలో జనించి సుషుప్తిలో లయించుచున్న మాయను మిథ్యగానున్ను మాయ కధిష్ఠానమైన ఆత్మను సత్యముగానున్ను నిశ్చయించి అధిష్ఠానమైన ఆత్మ తానుగా గ్రహింపవలెనని తాత్పర్యము.

18. జీవుని దెలిసినదనుకను । దేవుని భ్రమలాదలు నరుడు దేవుడుదలపక । జీవుండని వివరించిన భావంబునముక్తి బట్టబయలు వేమా॥ లోకంబున జీవునకుతన నిజరూపమైన ఆత్మను తానుగా తెలిసేవరకు దేవుడెట్టివాడో యెచ్చటనుండునోయని తనబుద్ధిభ్రమించుచునేయుండును. యదార్థముగా విచారించిన సర్వజీవులును స్వర్ణమందాభరణములవలె బ్రహ్మమందు కల్పితమైనటువంటి దేహస్థులయిన జీవుండు సర్వాభరణములును సువర్ణమనియెరిగినట్లు సర్వజీవులును బ్రహ్మముగా ను తెలిసిన మోక్షము స్వతస్సిద్ధమైయున్నదని తాత్పర్యము.

19. నీవాడిన నేనాడుదు। నీవుండిన నేనునందునిర్వ్యాకులుడనై। నీవు దలంచిన దలపుదు। నీవునగిన నేనునగుదు నిజముగ వేమా॥ లోకంబున జీవన్ముక్తుండయిన బ్రహ్మవేత్త తనస్వానుభవజ్ఞానమును వివరించుచున్నాడు. ఓ పరమాత్మ సచ్చిదానందస్వరూపుండవైన నీవు సర్వదేహములయందుండుటచేతనే ప్రతిబింబజీవుండనైన నేను యీదేహమందుంటున్నాను. ప్రజ్ఞానస్వరూపుండవైన నీవు దేహేంద్రియాదులనాడించుటచేతనే దేహము నేనని నటించుచున్నాడను. సర్వజ్ఞుండవైన నీవు ఆత్మయందు సంకల్పించుటచేతనే దేహమునాదియని తెలుసుకొనుచున్నాడను. ఆనందస్వరూపుండవైన నీవు ఆత్మయందు రమించుచుండుట చేతనే నేను దేహేంద్రియములతో రమించుచున్నాడను. నీవు బ్రహ్మానందానుభవముచే సంతోషించుటచేతనే నేను విషయానుభవముచేసంతోషించుచున్నాడను. కాని దేవుండవయిన నీవీదేహమందు లేకుండిన అస్తిభాతిప్రియజీవుని నామరూపములు నాస్తినభాతినప్రియములగుచున్నవి. కాబట్టి యీజగన్నాటకవిలాసము అధిష్ఠాన బ్రహ్మమైన ఆదిదేవుని విలాసముగాని ఆభాసజీవుని విలాసముకాదని తాత్పర్యము.

20. బ్రహ్మనృపతి వైశ్యశూద్రులౌ నరులును। బ్రహ్మవిష్ణుహరులు పశువులెన్న బ్రహ్మంబునెరుగక బహురూపులైరిట్లు॥ వి॥ లోకంబున బ్రహ్మేంద్రాది దేవతలున్ను, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రాది మానవులున్ను, పశుపక్షి క్రిమికీటకాది జంతువులున్ను, సర్వజీవులును బ్రహ్మమయులై యుండినన్ను, తమ నిజరూపము బ్రహ్మస్వరూపమని యెరుంగక మాయాకల్పిత నామరూప శరీరములు తామని దేహాభావముచేత దేహధారులై జననమరణ జీవభ్రాంతిని పొందుచున్నారని తాత్పర్యము.

21. దేవుడనగవేరు దేశమందున్నాడ దేహితోడగూడి దేహ

మందె వాహనములనెక్కి వడిదోలుచున్నాడు॥ వి॥ దేవుడనగా, అఖండ సచ్చిదానందస్వరూపుండైన ఆదిపరబ్రహ్మమే ప్రతిశరీరమునందు ప్రత్యగాత్మయై తనశక్తివల్ల యీ జీవయంత్రంబుల నాడించుచున్నాడు గనుక శరీరంబను రథంబునకు యింద్రియంబులను గుఱ్ఱంబులంగట్టి మనస్సనెడు కళ్లెమును పట్టి బుద్ధియనుసారథి తోలుటంబట్టి ఆత్మయను దేవుండు రథికుడై విహరించుటవలన సాక్షిస్వరూపుండైన దేవుండును, సంకల్పస్వరూపుండైన జీవుండును కలిసి ప్రతిశరీరమునందు అభిన్నులై యున్నారని తాత్పర్యము.

22. లేడులేడనినను లేడులేనేలేడు। కాడుకాడనినను కానెకాడు। తోడుతోడనినను తోడనే తోడవును॥ వి॥ జగత్కర్తయైన భగవంతుండు సర్వాంతర్యామియై సర్వజీవులయందును స్వతస్సిద్ధముగానుండినను యింద్రియమనంబుల కగోచరుడగుటవలన లోకంబున నాస్తికబుద్ధి గలవాడు దేవుడు లేడని భావించిన వానికి తాను లేనివాడుగానున్ను ఆస్తికబుద్ధికలవాడు దేవుడున్నాడని భావించినవానికి తానున్నవాడుగానున్ను, భేదబుద్ధిగలవాడు ఎవడును దేవుడుకాడని భావించినవానికి తానుగానివానిగానున్ను, అభేదబుద్ధికలవాడు సర్వము భగవంతుడని భావించినవానికి తానుతోడై సర్వదా వానివెంటనే తానున్నవాడుగానున్ను, తోచబడుచున్నాడు. కాబట్టి లోకంబున మానవులు ఆస్తికులై అభేదబుద్ధికలిగి ఆత్మస్వరూపుడైన దేవుని తమస్వరూపముగా గ్రహింపవలెనని తాత్పర్యము.

23. విన్నవానికంటె కన్నవాడధికుండు। కన్నవానికంటె కలియువాడు। ఉన్నతోన్నతుడయ్యె నుర్విలోపలనుండు॥ వి॥ లోకంబున సకల జీవులలో మానవుడుత్తముడు. అట్టిమానవులలో భగవంతుని మహిమవిని సంతోషించువాడత్యుత్తముడు. అట్లుసంతోషించినవానికంటె అం

తరాత్ముని దర్శించినవాఁడుత్తమోత్తముఁడు. అట్లు దర్శించినవానికంటె బ్రహ్మమందైక్యముచెంది జీవన్ముక్తిని పొందినవాఁడు సర్వోత్తముఁడు. కాబట్టి ముముక్షుండైన జీవుండు ఆత్మేశ్వరుండైన భగవంతుని ముందు పరోక్షముగా గ్రహించి పిమ్మట గురుసూత్రమువలన ప్రత్యక్షముగా దర్శించి అనంతరమందు స్వానుభవమువలన అపరోక్షసాక్షాత్కారమును పొందవలెనని తాత్పర్యము.

24. వ్రాతకొలఁదిగాని వరమీఁడుదైవంబు। చేతకొలఁదిగానివ్రాతకాదు। వ్రాతకజుఁడుకర్త చేతకు తాకర్త॥ వి॥ లోకంబున మానవులకు స్వయంకృషిచేతనే సర్వసుఖంబులును పొందబడుచున్నవిగాని స్వయంకృషిలేనివానికేసుఖమును లభించుటలేదు. కనుక దేహధారియైన జీవుండుతా నేఫలముకొరకు యెట్టికృషిచేయునో దేవుఁడును తన కష్టమునకు తగినఫలమునే యిచ్చువాఁడుగాని ఎక్కువతక్కువలిచ్చువాఁడుకాఁడు. జీవుడైన తాను జననమరణంబులకు స్వతంత్రుఁడుగాకుండినను దేవుని ప్రార్థించుటకు జీవుఁడు స్వతంత్రుఁడును జీవునిరక్షించుటకు దేవుఁడు స్వతంత్రుఁడును అగుటవలన జీవేశ్వరులకు అధికారతారతమ్యముచే కర్తృత్వముగలిగియున్నట్లు గ్రహించవలెనని తాత్పర్యము.

## దే హా త్మ లు

25. తనువుదెవరిసొమ్ము తనదనిపోషింప। ధనమదెవరిసొమ్ము దాచుకొనఁగ। ప్రాణమెవరిసొమ్ము బాయకుండఁగనిల్ప॥ వి॥ లోకంబున మానవులు అస్తి భాతిప్రియరూపమైన ఆత్మ తమనిజరూపమని తెలియక అనృతజడదుఃఖాత్మకమైన దేహమే తమనిజరూపమని భ్రమించి మాయదేహమును ప్రేమించిపోషించుటయు, అందుకొరకుమాయధనమునార్జించి దాచుకొనుటయు అందుకొరకు మాయప్రపంచమునా

శించి మాయప్రాణములు నిలుపుకొనుటయు యిదేమహేంద్రజాలము గనుక ముముక్షువులైన బుద్ధిమంతులు యీతను ధనప్రాణంబులు భగవన్నిర్మితములని భగవంతుని సొత్తు భగవంతున కర్పించి సర్వప్రపంచము భగవత్స్వరూపముగా గ్రహించవలెనని తాత్పర్యము.

26. ఈతనువునందుజూచిన । ఏతనువుల కింతెయనుచు ◆ నెరిగియుందన్నుం । జాతురుగా లోజూపున । నాతురమున తపసులెల్ల◆నమరగవేమా॥ లోకంబున తపసులనగా మోక్షముకొరకై పరితపించుచున్న పుణ్యాత్ములు అట్టితపోనిష్టులు తమదేహము సచ్చిదానందవిగ్రహమని న్నీ తమఆత్మ సచ్చిదానంద విగ్రహుడనిన్ని విచారించి సర్వనామరూప విగ్రహములలోను సచ్చిదానంద విగ్రహుడైన పరమాత్మయుండుటచేతనే సర్వరూపములును అస్తిభాతిప్రియరూపములగుచున్నవని గ్రహించి, తమదేహములోనున్న సచ్చిదానందబ్రహ్మమును అంతర్లక్ష్యముచేతగాని దర్శింపరాదని నిశ్చయించి సుషుమ్నాంతఃపురంబున లక్ష్యముంచి తమ్ము తాము దర్శించి తన్మయత్వమును బొందుచుందురని తాత్పర్యము.

27. తోలుగుళ్ళలోన దొడ్డదేవుండుండ । రాతిగుళ్ళలోన రాశిబోయ । రాళ్ళుదేవుండ్లైతే రాసులుమ్రింగవా॥ వి॥ లోకంబున శిలావిగ్రహములైన దేవతలు బుద్ధికల్పితములున్ను సచ్చిదానందవిగ్రహుడైన ఆత్మ స్వయంవ్యక్తుమున్ను అయినందున భగవదర్పణమైన పదార్థములన్నియును సచ్చిదానందవిగ్రహుడైన ఆత్మారాముడె అనుభవించుచున్నాడుగాని అచేతనములగు శిలావిగ్రహము లేమియును, అనుభవించుటలేదు.

కాబట్టి వివేకులైన మానవులు అకల్పితస్వయంవ్యక్తమైన ఆ

త్మేశ్వరుడే తిమదేహమునందు నేను నేనని జీవరూపంబున ప్రకాశిం
చుచున్నాడని నిశ్చయించి అస్తిభాతిప్రియరూపములయిన అఖిలవస్తువు
లను సచ్చిదానందబ్రహ్మమైన ఆత్మేశ్వరునకుఅస్తిభాతిప్రియరూపకము
గా అర్పించుటయే నిజమైన భగవదర్పణమని తాత్పర్యము.

28. ఇంద్రియములచేత నగ్గొందుచుండెడు। వెర్రిమనుజుడేల వె
దుకుశివుని। ఇంద్రియములురోసి యీశునిజూడరా॥ వి॥ ఇంద్రియముల
నగా ఇంద్రజాలమువలె మాయాస్వరూపములై లేనిప్రపంచమున్నట్లు
తోచించి బ్రహ్మమైన ఆత్మను భ్రమింపజేయునవి. అదెట్లంటె లోకం
బున శ్రవణేంద్రియవిషయమువలన సర్పము పాములవానిచే జిక్కిభం
గపడుచున్నది. త్వగింద్రియవిషయమువలన యేనుగు మావటివానిచే
చిక్కపడుచున్నది. చక్షురింద్రియవిషయమువలనమిడతలగ్నిలోపడిహ
తమగుచున్నది. జిహ్వేంద్రియవిషయమువలన చేపగేలమునచిక్కిమృ
తమగుచున్నది. ఘ్రాణేంద్రియవిషయమువలన తుమ్మెద తావిలోముని
గి నశించుచున్నది. ఇట్లొక్కొక్క యింద్రియముచేత నొక్కొక్క ప్రా
ణిహతమగుచుండగా దశేంద్రియములలో జిక్కికొన్న ఆత్మమృత్యు
వునెట్లుదాటగలుగును. మహాశూరుడయినను మృత్యువుచేచిక్కకమాన
డు. కావున ముముక్షువైనవాడు యింద్రియాణిజయశ్శూరః అనున్యా
యంబున యింద్రియముల నిగ్రహించి ధర్మంచరతిపండితః అనున్యా
యంబున పరమధర్మమైన బ్రహ్మనిష్ఠ నభ్యసించి పరమేశ్వరుని దర్శిం
చవలెనని తాత్పర్యము.

29. ఆత్మదేహమందు నతిసూక్ష్మముగజూచి దేహమాత్మయం
దు తేటపరచు విధముకన్నపరకు వేదియులేదురా। వి॥ లోకంబున జీ
వులకు దేహమేతానని తెలియబడుచుండునుగాని ఆత్మతానని తెలియబ

పుట లేదు. ఒకవేళకొందరికి ఆత్మ తానని తెలియబడినను ఆత్మకనుపించుటలేదు. ఆత్మనుదర్శించినపుడుగాని జీవభ్రాంతినశింపదు. బ్రహ్మాదులకైనను ఆత్మనుదర్శించుటకలవిగాదు. ఆత్మసందర్శనముకొరకే బ్రహ్మవిద్యయేర్పడియున్నది. సాధనసంపన్నులుగాని బ్రహ్మవిద్యకు పాత్రులుగాగు బ్రహ్మవిద్యవలనగాని ఆత్మసాక్షాత్కారము కలుగనేరదు. సద్గురుకటాక్షము లేక బ్రహ్మవిద్యపట్టుపడదు. పరశువేదిసోకిన యినుము బంగారమైనట్లు బ్రహ్మజ్ఞానము సోకిన జీవుడు బ్రహ్మమేయగుచున్నాడు.

కావున దేహధారులైన జీవులు సాధనసంపన్నులై సద్గురువుల సేవించి ఆత్మబోధాంజనముగ్రహించి, అవాఙ్మానసగోచరమైన ఆత్మనుదర్శించి, దేహభావమును తొలంగించుకొనుటయే పరశువేదిని సంపాదించుటయని తాత్పర్యము.

30. మహిని దధిని ఘృతము మానులందనలంబు। సౌరుసుమములందు సౌరభంబు। తిలల తైలమట్లు తేజరిల్లు చిదాత్మ।।వి।। లోకంబున పెరుగుయందు నెయ్యిన్ని, కట్టెలయందగ్నిన్ని, పువ్వులయందు తావిన్ని నువ్వులయందు నూనెయున్ను, అంతర్భూతమైయెట్లు మరుగుపడియుండునో, అటువలెనే, అఖండసచ్చిదానంద బ్రహ్మమైన ఆత్మ, ప్రతిశరీరమునందుండి జడంబులైన యింద్రియంబులతోగూడి, నేత్రముకు నేత్రమై, చూచుచు, శ్రోత్రముకు శ్రోత్రమై వినుచు, గాత్రముకుగాత్రమై కదలుచు, వాక్కుకు వాక్కై పలుకుచు, మనస్సుకు మనస్సై, సర్వమునుతాను గ్రహించుచు, తన్నుతానెరుగక తానుగాని దేహము తానని భ్రమియించుచున్నాడు.

కాబట్టి దేహధారియైన తాను, పెరుగు తరచి నేయితీసినట్లున్ను కట్టెలను మథించి అగ్నిని పుట్టించినట్లున్ను, నువ్వులను పిండి నూనెతీసినట్లున్ను, పువ్వులనుండి తావిని గ్రహించినట్లున్ను, తనదేహేంద్రియ ప్రా

ణాంతఃకరణంబులను విచారజ్ఞానముచే మధించి సర్వాధిష్ఠాన పరిపూర్ణ సచ్చిదానంద బ్రహ్మమును తానుగా గ్రహించవలెనని తాత్పర్యము.

31. తనదులోనియాత్మ తానెరుగదలచెగా తనువుగుడిని జేసి తన్నునిలిపి। లోకబుద్ధివిడచి లోచూపుజూడరా। వి॥ లోకంబున మానవుడత్యాసక్తచిత్తుడై యాత్మసందర్శనముకొరకు పరితపించుచున్నయెడల అట్టివాడు తనదేహమును దేవాలయముగాను, తనఆత్మను దేవునిగాను, నిశ్చయించి, నేను జీవుండను పురుషుండను, బ్రాహ్మణుండను, పండితుండను, ధనవంతుడను, అనుసర్వజ్ఞత్వమున్ను, నేనుశూద్రుండను, మూఢుండను దరిద్రుండను నీచుండను, అనుకించజ్ఞత్వమున్ను, మొదలైన లోకవాసలను విడచి నేను స్వయంభువును, స్వప్రకాశుడను, నిత్యుడను, నిరంజనుడను, అకల్పితుడను అశరీరుండనుఅనిభావించి, నిరంతర నిధిద్యాసనముచే తనబ్రహ్మస్వరూపమును తనదేహములోనే చూచుకొనవలెనని తాత్పర్యము.

## దేశకాలములు

32. దేశదేశములను గాసిలితిరిగి న। నాత్మయందుధ్యాన మంటుకొనునె। కానులకును దిరుగ గలుగునామోక్షంబు॥ వి॥ [illegible] మానవులు, యేబ్రహ్మాత్మప్రదేశముబ్రహ్మాదిదేవతల జ్ఞాతృత్వజ్ఞేయమై జన్మమృత్యురహిత శాశ్వత సుఖప్రదేశమై భాసించుచున్నదో [illegible] వల్యసుఖప్రదేశము తమస్వదేశమని యెరుంగక మాయాకల్పిత [illegible] హారామ ప్రదేశంబును తమస్వదేశంబనుకొని, పట్టణపర్వతారణ్యప్రదేశంబుల చరించుటవలన చిత్తచాంచల్యము గలుగుటయేగాని, స్వస్వరూపమందు ధ్యాననిష్ఠకలుగనేరదు.

కనుక ముముక్షువులైన విరక్తులు, దేశకాలవస్తువులన్నియును

మాయాకల్పితంబులని నిషేధించి, అకల్పితస్వయంవ్యక్తమైన ఆత్మోపదేశమే తమస్వదేశముగా ధరించి, పరమయేకాంతకైవల్య శుభావేశంబునొందవలెనని తాత్పర్యము.

33. ఎంతభూమిదిరిగి యేపాట్లుబడుచున్న। అంటనీకప్రాప్తి వెంటదిరుగు। భూమిక్రొత్తలైన భోగంబుక్రొత్తలా॥ వి॥ లోకంబున మానవుడు తానెన్నిదేశములుతిరిగి, యెంతకష్టించినను, ప్రాప్తాప్రాప్తములు తనవెంటనే యుండుటవలన తానిచ్ఛయించిన యర్థంబులుతనప్రాప్తానుసారముకొలదియేతనకులభించునవిగాని,అధికములభించనేరవు. కావున దేశములు క్రొత్తవైనను, దేహములుక్రొత్తవైనను తాననుభవించెడి విషయభోగంబులాశించిన భోగంబులగుచున్నవిగాని దివ్యభోగంబులుగానందున బుద్ధిమంతుడైనవాడీజన్మసాఫల్యంబైన దివ్యభోగంబునకీజన్మమందేయత్నించి, యీజన్మయందే నిత్యసుఖంబనుభవించవలెనని తాత్పర్యము.

34. కాలముతనకిక చాలాకాలము గలదంచునున్న కాలమునందుగ। కాలును తనుతాదెలియక। కాలెనుతొలిచామునందు గొబ్బున వేమా॥ దేహధారియైన జీవుండు తానుత్తమమానవజన్మమెత్తిన యుక్తకాలమందు దినవారపక్షమాసాబ్దయుగకల్పాంత దివారాత్రిరూపంబైన కాలంబును మాయాకల్పిత మహేంద్రజాలంబని యెరుగక మాయాకల్పిత మలమూత్రదేహముతానని భ్రమించి తనకు జీవితకాలము నూరేండ్లవరకు కలిగియున్నదని నిశ్చయించి జీవితకాలమందు జీవునిగుట్టుతెలియక వెనుకటి పశుపక్ష్యాది జన్మములవలెనే యవివేకియై యథోగతినిబొందుచున్నాడని తాత్పర్యము.

## తల్లిదండ్రులు

35. తల్లిదండ్రుధనుచు తత్వంబునెరుగరు। యోనిలింగములను

నుద్భవించు। విష్ణువరయతల్లి వెలయరుద్రుడుతండ్రి॥ వి॥ తల్లిదండ్రుల నగా అనాదిదంపతులైన ప్రకృతిపురుషులని యంతరార్థము అదెట్లంటె పరబ్రహ్మశక్తియైన మూలప్రకృతి క్షేత్రవంతమై స్త్రీరూపమున్ను పరబ్రహ్మమైన దేవుండు బీజవంతమై పురుషరూపమున్ను, ధరించి, స తీపతులై క్రీడించిన, యాప్రకృతిపురుషులు మరల స్త్రీపురుషులై జ న్మించి, స్త్రీపురుషులు మరల తలిదండ్రులై ఆతలిదండ్రులు మరల సతీపతులై, ఇట్లనేకులైన తలిదండ్రులు సతీపతులై జన్మించి గతించు చున్నను అసలు ప్రకృతి పురుషులు మాత్రము నశింపక ఏకోత్తర వృ ద్ధిగా పరిణమించుటవలన క్షేత్రవంతమైన మన తల్లి విష్ణుఅంశమనిన్ని, బీజవంతమైన మనతండ్రి యీశ్వరాంశమనిన్ని, ప్రకృతి పురుషాంశ మైన యీజగత్తు శివశక్త్యాత్మకమనిన్ని, తత్వజ్ఞులు తెలిసికొన్నురు. కా బట్టి లోకంబున మానవులు తమ తల్లిని విష్ణుస్వరూపమనిన్ని, తండ్రిని శివస్వరూపమనిన్ని, భావించి, తలిదండ్రులకంటె ప్రత్యక్షదైవము లేదని నిశ్చయించి తలిదండ్రులను దైవభావముతో ప్రేమించి భక్తివి శ్వాసములతో పూజించవలెనని తాత్పర్యము.

36. పృథివికుదకమేగె పృథివిపై మొలకెత్తె। మొలకపృథివికే గె మొగుడె సుతుడు। ధరనుజీవులకెల్ల తల్లియే పెండ్లాము వి॥లోకంబు న భూమియందు జలము వర్షించిన బీజము లంకురించి వృక్షములగుచు న్నవి. యావృక్షములందు బీజములుద్భవించి మరల భూమి యందేఅం కురించుచున్నవి. అటువలెనే లోకంబున జీవులకు ప్రకృత్యంశమైన క్షేత్రమందు పురుషవీర్యము వర్షించిన అది పురుషరూపమై జన్మించి యాపురుషవీర్యము మరల స్త్రీయందే ప్రవేశించుటవలన అనాదిదంప తులైన ప్రకృతి పురుషులలో ఆదిపురుషుడే తండ్రియై యాతండ్రియే భర్తయై యాభర్తయే పుత్రుడగుచున్నాడనిన్ని. అదిస్త్రీరూపమై జ

న్మించి, యాక్షేత్రము పురల పురుషవీర్యమును పాత్రియగుటవలన ఆ న్నాదిమూలప్రకృతియే తల్లియై యాతల్లియేభార్యయై యాభార్యయే కూతురగుచున్నదనిన్ని తాత్పర్యము.

37. అమ్మనుమీయాలనగా అమ్మనగానాలుసుమ్మి యీయి ద్ధరికిన్ । యిమ్మహిలో పరమాత్ముని నెమ్మదిలో దెలియువాడు నే ర్పరివేమా॥ లోకంబున ఒక్కస్త్రీయే భర్తకు భార్యగాను, పుత్రునకు తల్లిగాను రెండువిధములై యెట్లు వ్యవహరింపబడుచున్నదో అటువలె నే ఒక్కడైనపరమాత్మ జీవుడని దేవుడని రెండువిధములవ్యవహరింపబ డుచున్నాడు.

కాబట్టి మూమక్షుండైనవాడతినేర్పరియై జీవుండైన తాను దేవు డైన బ్రహ్మముకంటె వేరుకాదని గ్రహించుటయే జీవన్ముక్తియని తాత్పర్యము.

సతీపతులు.

38. పతియొప్పిన సతియొప్పును । పతిసతులొకటైన పరమపావ నమందున్ । సతిపతిన్యాయమె మోక్షం బతులితపరమాత్మ కైక్యమ గురా వేమా॥ లోకంబున సతీపతులకు యేకత్వభిన్నత్వంబులు రెండు ను కలిగియున్నట్లు జీవాత్మపరమాత్మలకు యేకత్వభిన్నత్వంబులు కల వని యర్థము. అదెట్లంటే సతీపతులు తమగృహకృత్యమం దెవరిపనులు వారేచేసికొని యెవరిసుఖదుఃఖములు వారే అనుభవించుటవలన సతీప తులకు సంసారమందు భిన్నత్వమున్ను, సంభోగమందు సతీపతులు సర్వ వ్యాపారంబులు చాలించి, సంకల్పవికల్పంబులు వర్జించి అన్యోన్యగా ఢాలింగన చుంబనాదులచే విషయానంద పరవశులై దేహప్రపంచము లు మరచి తన్మయత్వము జెందుటవలన సంభోగమందు యేకత్వము న్ను యెట్లుసహజమైయున్నదో అట్లే జగన్నాటకమందు దేవుడు సూ

త్రీధారియై నడిపించుటయు జీవుడు వేషధారియై నటించుటయు స్వభావమైనందున జీవబ్రహ్మలకు వ్యవహారమందు భిన్నత్వమున్ను పరమార్థమందు యేకత్వమనగా. దేహధారియైన పురుషుండుఆత్మపత్నియగు తనమూలప్రకృతిని ముందు వశపరచుకొని, దేహమేమృత్యువని విరక్తిభావమున్ను, ఆత్మయే నిత్యమని భక్తిభావమున్ను, జ్ఞానమేముక్తియని యుక్తిభావమున్ను, సంగ్రహించి సచ్చిదానంద ప్రకృతియైన తన ముక్తికాంతతోగూడి అన్యోన్యగాఢాలింగనంబున బ్రహ్మాకారాకారిత వృత్తితో రమించుచు, ఆత్మరతి, ఆత్మక్రీడా ఆత్మమిథునంబులచే ముక్తికాంతాసంభోగంబువలన తన్మయుండై తనువుమరచి తానుతానై యుండునదే జీవబ్రహ్మైక్యానుభవమని తాత్పర్యము.

39. పొలతిదావవహ్ని పురుషుడాజ్యఘటంబు కదసి యుండరాదు కదిసెనేని । బ్రహ్మయైన కూతు బట్టకమానడు ॥వి॥ లోకంబున జీవులకు స్త్రీయత్వమగ్నివంటిదిన్ని, పురుషత్వము నేతివంటిదిన్ని, అగుటవలన అగ్నిపొడచూపిన మాత్రమున నేయికరిగిపోవునట్లు పురుషుడెంత నిర్మోహియైనను స్త్రీరూపము పొడచూచిన కామానలముచేత హృదయము కరిగిఅస్ఖలితుండైనను మనస్ఖలితము నొందక మానడు. కావున ముముక్షుండు లోకంబున స్త్రీరూపమే పురుషునకు మృత్యురూపమని గ్రహించి స్వప్నమందైనను స్త్రీరూపమును స్మరించకూడదని తాత్పర్యము.

40. ఈతగింజయోన కేగెడుజనములు । కంచముకడపిల్లి గాచినట్లు పంచబాణుని యింటి బానిసెకాడుకులు వి॥ లోకంబున కాంతాకనకంబులు రెండును రెండుయంత్రంబులై సంసారచక్రంబును ద్రిప్పుచున్నవి. అందు మొదటికామినీ యంత్రంబు చేతన రూపంబై అయస్కాంత చందంబున పురుషాకారంబుల నాకర్షించుటవలన మానవులు

పురుషసింహము లైనను గ్రామసింహములవలె తమ పాండిత్యపరాక్రమంబులు పదటగలిపి మన్మథగృహంబునకు బానిసలై యోనిద్వారంబున కెదురుచూచుచు తుదకు యమద్వారంబునకు పాల్పడుచుందురు. కాబట్టి ముముక్షువులైన బుద్ధిమంతులు "స్త్రియంత్యక్త్వాజగత్త్యక్త్వా జగత్త్యక్త్వా సుఖీభవా" అనున్యాయంబున యమద్వారంబైన కామినీయంత్రంబు నింతటితో వర్జించిన జగద్భ్రాన్తి నివర్తించును. అట్లుజగద్భ్రాన్తి నశించిన జీవుండు స్వయంబ్రహ్మముతానై స్వస్వరూపమును బొందుచున్నాడని తాత్పర్యము.

జననమరణములు,

41. జనన మరణములకు నరిస్వతంత్రుడు గాడు మొదటకర్తగాడు తుదనుగాడు। నడుమకర్తననుట నగుబాట్లుగాదురా విశ్వ॥ దేహధారియైన జీవుండు జననమరణంబులు దేహధర్మంబులనిన్ని క్షుత్పిపాసలు ప్రాణధర్మంబులనిన్ని, సుఖదుఃఖంబులు మనోధర్మంబులనిన్ని, కర్తృత్వ భోక్తృత్వంబులు ప్రకృతిధర్మంబులనిన్ని సాక్షిత్వ పూర్ణత్వంబులు ఆత్మధర్మంబులన్ని, తెలియనేరక ప్రకృతివికారంబులైన స్వతంత్రకర్తవ్యంబులు సాక్షియైన తనయందారోపించుకొని అకర్తయైన ఆత్మ కర్తయై కర్మబంధమున కట్టుబడుచున్నాడు. కాబట్టి జీవుండైనతానుస్వయంబ్రహ్మమై సముద్రమువలె పరిపూర్ణుండును, పర్వతమువలె నిశ్చలుండును, సూర్యునివలె స్వప్రకాశుండునునై యెప్పుడును యేకరీతినేయున్నాడని వివేకమనంబున గ్రహించి, సర్వసాక్షిత్వంబున పరిపూర్ణశిద్ధినొందవలెనని తాత్పర్యము॥

జాతిమతములు

42. మాలవాడైనను మరియాత్మమీదను। మనసునిల్పనేని మాలగాడు। మనసునిల్పకున్న మహిమీదమాలడు॥ వి॥ లోకంబున మాన

వులలో బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర చండాల జాతులు గుణస్వభావ తారతమ్యములచే సృష్టియందేర్పడియున్నవి గాని నడుమ వచ్చినవిగావు. అందుకు నిదర్శనముగ సర్పములందు బ్రహ్మజాతి సర్పమని మణులయందు బ్రహ్మజాతిరత్నమని, క్షత్రియజాతిరత్నమని, వైశ్యజాతిరత్నమని, సంకరజాతిరత్నమని, ఉత్తమమధ్యమాధమ లక్షణంబులచే జాతిభేదంబులేర్పడియుండుట లోకప్రసిద్ధమేఅయి యున్నది. కాబట్టి లోకంబున ఉత్తమజన్మమెత్తిన మానవుడేజాతివాడైనను ఆత్మానాత్మవివేకముచేత పరబ్రహ్మమైన ఆత్మయే యిట్లుమూర్తీభవించి జీవరూపంబున ప్రతిశరీరమునందు ప్రత్యక్షమై యున్నాడని గ్రహించి పరబ్రహ్మమైన భగవంతునియందు తన చిత్తమునర్పించి భక్తిప్రపత్తులతో భజించువాడుత్తమజాతివాడనిన్ని అట్లు ఆత్మవిచారణలేక భగవద్భక్తి సలుపక పామరుడై ప్రవర్తించు వాడగ్రజాతుడైనను అధమజాతుడని తాత్పర్యము.

43. మతములెన్నియైన మాయచిక్కులెగాని। ఆత్మచిక్కు దెలియ నలవిగాదు। ఆత్మచిక్కుదెలుపునాతడే సద్గురుడు॥ వి॥ లోకంబున మానవులకు వర్ణాశ్రమ మతాచారము లెన్ని గలిగియున్నను దేవునిగుట్టును జీవునిమట్టును రెండును సమర్మకముగా నెరిగించి జీవుని ముక్తిని బొందించునది వివేకమతమున్ను, దేవునిగుట్టును జీవునిమట్టును మర్మముదెలుపక మాయాకల్పిత మతపంకంబులలో ముంచునది అవివేకమతమున్ను అయినందున ముముక్షువులైన మానవులు తామేమతస్థులైనను వివేకమతము నవలంబించి సద్గురువును సేవించి మాయాతీతుడైన పరమాత్ముని దర్శించి మాయచిక్కును విసిపించుకొనవలెనని తాత్పర్యము,

## ఇహపరములు.

44. ఇహమునందు బాధలెన్నైన బడవచ్చు । యెవ్వనిబాధ లేక నడరవలెను । పరులబాధలేక బ్రతుకుడీనరులార ॥వి॥ లోకంబున జీవులకు దరిద్రముచేత క్షుద్బాధయును దుష్టజంతువులచేత దేహబాధయును దారాపుత్రాదులచే ఈతిబాధయును సంభవించుట సహజము గనుక పరులవలన తమకెట్టి బాధలు సంభవించినను సహించుకొని తాము పరులను బాధింపక బ్రతుక నేర్చిన వారికి యమునివలన యేబాధయును కలుగనేరదు. అట్లుగాక తమజీవనము కొరకు యేజీవుని తాము నెట్టిబాధనొందింతురో అద్దే ప్రకారము ఆజీవహింస తమ్ములను బాధింపకమానదు. కాబట్టి బుద్ధిమంతులైన మానవులు అహింసా పరమోధర్మః అను న్యాయము ననుసరించి జీవహింసచేయక జీవించుటయే పరమధర్మమని గ్రహించి పాపభీతితో ప్రవర్తించవలెనని తా॥

45. పరముపరమటంచు పరమేడనోయంచు । పాట్లుపడుదురెంతో పరముకొరకు ఇహమునందు పరము నెసగుటగానరు ॥వి॥ లోకంబున మానవులు యిహపరములనగా మాయాకల్పితములని యెరుంగక భూలోకము యిహమనిన్ని స్వర్గాదిలోకములు పరమనిన్ని భ్రమించుచుందురు. యథార్థము విచారించిన స్వర్గమర్త్యవైకుంఠాది లోకములన్నియును పరబ్రహ్మమైన తనయందే కల్పితమై తనకు దృశ్యములగుచున్నవి. కాబట్టి వివేకులైన బుద్ధిమంతులు పరబ్రహ్మమైన తనకంటె అధికమైన వస్తువున్ను బ్రహ్మానందముకంటె పరమైన సుఖమున్ను తనయందుతప్ప యేలోకమందును లేదని నిశ్చయించి ఇహపరముల రెంటికిని తానే అధిష్ఠానమని గ్రహించి యిహపరలోక భ్రాంతి నింతటితో నివరి ంచుకొనవలెనని తా॥

46. ఎరుకకన్న సుఖము ఏలోకమున లేదు । ఎరుక నెరుక నెవరి కెరుక లేదు యెరుక సాటి యెరుక యెరుక యేతత్వంబు ॥వి॥ ఎరుకనగా పరమాత్మని. పరబ్రహ్మమని, ప్రజ్ఞానమని, ప్రత్యగాత్మని, తెలివని, జ్ఞప్తియని, జీవుడని, దేవుడని, పర్యాయనామంబులతో వ్యవహరింపబడు చున్నది. స్వర్గ, మర్త్య వైకుంఠాది సర్వలోకములను ఎరుకచేతనే ప్రకాశింపబడుచున్నవి. దేవ మానవ తిర్యగాది సర్వజీవులును ఎరుకచేతనే నటించుచున్నారు. గాని యెరుకయే బ్రహ్మమని యేజీవుడును యెరుగుటలేదు. కాబట్టి లోకంబున మానవులు ప్రజ్ఞానబ్రహ్మమే తమ నిజ రూపమని గ్రహించిన ఆయెరుకయే సర్వసాక్షియై సర్వలోకములయందు సముద్రమువలెనిండి తానేఅచలపరిపూర్ణమై తానుతానై ప్రకాశించుచున్నదని తా॥

47. ఇంతకాలముండి యెరుకమాలినజీవి చచ్చిపుట్టుచుండు సహజమనుచు । యెరుక మరచుచోటు నెరుగునాబ్రహ్మంబు ॥వి॥ లోకంబున జీవుండు యెన్నికోట్లజన్మము లెత్తినను యెంతకాలము జీవించినను తన్నుతానెరుగక జననమరణములు తన స్వభావములే యనుకొని మాయదేహమునే మరిగి మాయలోకమునేతిరిగి మాయసంసారమునే మునుగుచున్నాడు గాని మహామాయ యైన తనసంకల్పశక్తి యేపరబ్రహ్మమునందు, జనించి, లయించుచున్నదో యామోక్షస్థానమును తానెరుగుటలేదు. కాబట్టి ముముక్షుండైనజీవుండు జగద్రూపమై పరిణమించిన తన సంకల్పశక్తి యిడాపింగళనాడులవెంట బహిర్గతమై వ్యాపించి అంతర్ముఖమై సుషుమ్న నాడియందు లయించుచున్న మర్మమును గురుమూలముగా గ్రహించి సర్వసాక్షియైన తురీయస్థానమును పొందవలెనని తా॥

48. ఎరుగక బుట్టును తనువులు మురికిని మునిగున్న తనువు

మోసుటగాదా యెరుకగలతనువు నొందిన మరియును జనిమ్మించుచెట్లు మహిలోవేమా॥ లోకంబున మానవుడు దేహభావముచేత దేహరూపుడై మలమూత్ర దేహమునే మోయుచు, మలమూత్ర దేహముకే మురియుచు, మలమూత్రదేహమునే కోరుచుండుటవలన మరల మలమూత్రదేహమే సంభవించుచున్నది. కాబట్టి దేహధారియైన జీవుండు తన నిజరూపము అకల్పిత స్వయంబ్రహ్మ స్వరూపమని గ్రహించి బ్రహ్మభావముచే ప్రవర్తించుచున్న యడల నిరుపాధిక పరబ్రహ్మమైన దేహికి మాయాకల్పిత శరీరము మరి సంభవింపదని తా॥

49. మేఘమడ్డమైన మిహిరుని జెరుచును। చిత్తమడ్డమైన స్థిరముజెరుచు। మరుపు లడ్డమైన మరిముక్తి జెరుచురా ॥వి॥ లోకంబున స్వయంప్రకాశమానంబగు సూర్యబింబమును జడభూతంబయిన మేఘం బావరించి స్వరూపమును మరుగుపరుచుచున్నట్లు ప్రజ్ఞాన సూర్యుండైన పరమాత్మను అజ్ఞానప్రకృతియైన మాయావరించి ప్రవృత్తి నివృత్తిరూపంబున ప్రతిబంధమును కలుగజేయుచున్నది. అది యెట్లంటె నిర్వికల్ప నిస్సంకల్పుడైన ఆత్మకు సంకల్ప వికల్పంబులు కలిగించి, అవస్థారహితుండైన ఆత్మకు జాగ్రన్నిద్రలు కల్పించి, నిర్వికారుండైన ఆత్మకు కామవికారంబులు పుట్టించి, నిత్యముక్తుండైన ఆత్మను మృత్యుభయము నొందించునది ప్రవృత్తిన్ని; కేవలప్రజ్ఞాన స్వరూపమైన బ్రహ్మమును సుషుప్తి రూపంబున నావరించి స్వరూప విస్మృతి గలిగించి జడత్వమును పొందించునది నివృత్తిన్ని యైనందున, ముముక్షుండైనజీవుండు అఖండవ్యక్తియైన ఆత్మకు ఆవరణ విక్షేపములచే తెరపుమరపులు సంభవించుచున్నవని గ్రహించి శుద్ధమైన యెరుకయే బ్రహ్మమని నిశ్చయించి యీ తెరపు మరుపుల రెంటిని త్యజించి ప్రజ్ఞామాత్రుడై ప్రకాశించవలెనని తాత్పర్యము

50. మతముజారి మరుచు మధురాధరము జూచి మగువరూ
పుజూచి మనసుమరచు। యోనిజూచిసర్వయోగముల్ మరచురా ॥వి॥
లోకంబున మానవుడు భగవన్మాయ స్త్రీరూపమై భ్రమింపజేయుచు
న్నదని తెలియక కామినీరూపమును కన్నుల జూచిన మాత్రమున తే
న తత్వజ్ఞానమును మరచి, మనోధైర్యమును విడచుచున్నాడు. అధరో
ష్ఠము తగిలినంతనే ఆశ్రమధర్మములను మరచి కులగోత్రమును విడ
చుచున్నాడు. మన్మథగృహము జూచినంతనే మతిభ్రష్టుడై బ్రహ్మనిష్ఠ
ను మరచుచున్నాడు. కాబట్టి బుద్ధిమంతుడైన మానవుడు తన మూల
ప్రకృతియే కామినీరూపమై తన్నుభ్రమింపజేయుచున్నదని వివేకమనం
బున విమర్శించి, తనుసంగమమే తనకుమృత్యురూపమనిన్ని; హృదయ
సంగమమే తనకుముక్తిస్వరూపమనిన్నిగ్రహించి, దేహముతాననే మర
పును దేవుడుతాననే యెరుకచేతతొలగించి, తనసచ్చిదానంద స్వరూప
మైన ముక్తికాంతతో రమించుటయే హృదయసంగమమునితాత్పర్యము.

## ధర్మకర్మములు

51. పరుల కుపకరింప పాపక్షయంబగు। పరుల కుపకరింప ప
ట్టుకొమ్మ పరులకుపకరింప పరలోకసాధన ॥వి॥ లోకంబున ధర్మము
అధర్మము, పరమధర్మము అని మూడు మార్గములుగలవు. అందు ధ
ర్మమనగా, ఈశ్వరశాసనంబులైన వేదశాస్త్రముల ననుసరించి వర్ణా
శ్రమపద్ధతుల నవలంబించి సత్యముతప్పక సంచరించునది సన్మార్గమని
న్ని, అధర్మమనగా, వేదశాస్త్రములకు విరుద్ధముగా చరించునది దుర్మా
ర్గమనిన్ని, పరమధర్మమనగా, భగవద్భక్తుండై బ్రహ్మవిద్య నభ్యసించి
ఆత్మజ్ఞానంబున వర్తించునది ముక్తిమార్గమనిన్ని చెప్పబడుచున్నది.
కాబట్టి జీవుడుత్తమ జన్మమెత్తినందుకు ‟ పరోపకారార్థ మిదంశరీరం"

అనున్యాయంబున ముందు ధర్మమార్గము ననుసరించి పరమదయాళులై పరమేశ్వరార్పణముగ పరులకు సత్కరించిన యాపరోపకారము బహుజన్మార్జిత పాపరాసులను భస్మము జేయుచు, యాపరోపకారము, అఖిలయిశ్వర్యంబుల కాటపట్టై సర్వకార్యములను సిద్ధించుచున్నది. యాపరోపకారసత్కారమే భక్తిజ్ఞానవైరాగ్యంబులకు పరమసాధనమై జీవుని మోక్షసామ్రాజ్యమును పొందించుచున్నదని తాత్పర్యము.

52. దానమొసగుకన్న దేవంబు మరిహెచ్చు। దేనమొసగు కన్న తెలివిహెచ్చు తెలివికన్న యాస తెగగోసినది హెచ్చు ॥వి॥ లోకంబున జీవులకు మనోవాక్కాయములచే చేయబడిన కర్మమూడువిధములు. అందు మానవుడు దేహరక్షణకై న్యాయవృత్తితో జేయుచున్న సంసారకృత్యమంచు పుణ్యపాపములు రెండును లేనందున అదినిత్యకర్మనిన్ని. అసత్యవంతుడై అన్యాయవృత్తితో జేయుచున్న జీవనకృత్యము పాపకార్యమైనందున అది దుష్కర్మనిన్ని, ఈశ్వర ప్రీతికొరకుచేయుచున్నపరోపకార సత్కారము పుణ్యకార్యమైనందున అదిసత్కర్మనిన్ని. చెప్పబడుచున్నది. పాపమూలంబయిన యాజన్మకర్మ ప్రతిభంధము సత్కర్మరూపంబైన పుణ్యమూలంబునంగాని నివర్తించనేరదు. కాబట్టి లోకంబున మానవులు కాయముచే చేయబడిన దానధర్మములు కాయికతపంబనియు, వాక్కుచే జేయబడిన మంత్రజపాదులు వాచకతపంబనియు మనస్సుచే చేయబడిన ధ్యానపూజనాదులు మానసికతపంబనియు, యీమూడు నొకదానికంటె నొకటి శ్రేష్టతరమనియు గ్రహించి మొదట దానధర్మములచేతనున్నా పిమ్మట ధ్యానపూజనములచేతనున్నా యీశ్వరసంతుష్టి కలిగించి అనంతర మాత్మేశ్వరుని తానుగా గ్రహించి, దేహమందున్న జీవితాశను త్రుంచివేయుట సర్వోత్కృష్టమైన సద్యోముక్తియని తాత్పర్యము.

53. మంచిశకునములని యెంచి పెండ్లాడిన। వారలొకరు లేరు వసుధలోన। జనులకర్మములను శకునముల్ నిలుపునా॥ వి॥ లోకంబున మానవులు మంచిముహూర్తములను విచారించి మంగళాశీర్వాదంబులుచేయించి వధూవరులకు వివాహ కార్యంబులు జరిగించుచున్నను, యెవరికర్మసూత్రమున వారు మృతినొందుచున్నారుగాని, లోకంబున యేమంచిశకునమున్ను యెవ్వరిని బ్రతికించుటలేదు. కాబట్టి జీవుండు తనస్వయంకృత కర్మఫలము తాననుభవించవలసినదేగాని, యెవరును, తప్పించలేరని గ్రహించి జన్మకర్మమూలంబైన అజ్ఞాన ప్రతిబంధమును ఆత్మజ్ఞానముచేత యీజన్మమందే తొలగించుకొని జన్మసాఫల్యమును జెందవలెనని తాత్పర్యము.

## గురుశిష్యులు

54. గురువనగా పరమాత్ముడు। పరగంగాశిష్యుడనగ పటుజీవుడగున్। గురుశిష్య జీవసంపద గురుతరముగ గూర్చునతడు గురువగువేమా॥ లోకంబున గురుశిష్యులనగా సర్వాధిష్టానపరిపూర్ణ సచ్చిదానంద స్వరూపుండైన పరబ్రహ్మమొక్కడే సర్వజ్ఞుండై ప్రకాశించుటవలన దేవుండనిన్ని, దేహధారియై కించిజ్ఞుండగుటవలన జీవుండనిన్ని, వ్యవహరింపబడుచున్నాడు. కాబట్టి దేహధారియైన జీవుండు సర్వజ్ఞుండైన సద్గురువును సేవించి, మోక్షసాంబ్రాజ్యప్రదంబైన ఆత్మజ్ఞానమును సంగ్రహించి, ఆత్మసాయుజ్యమును పొందినయడల జీవాత్మదేపరమాత్ముడై ప్రకాశించుచున్నాడనిన్ని, అట్టిజీవన్ముక్తుండైన పరిపూర్ణుండు లోకంబున ముముక్షువుల కాత్మజ్ఞానముపదేశించి, రక్షించుటకు సమర్థుడైన సద్గురువగుచున్నాడనిన్ని తాత్పర్యము.

55. శిష్యవర్గమునకు శివుజూపనేర కానిమతములోన గలుపు

నట్టి గురుని యెరుకవరయ గుడ్డెద్దుజొన్న రా॥ వి॥ లోకంబున అచల బోధని, అక్షరసాంఖ్యమని, సాంఖ్యసూత్రమని, శాక్తేయమని, అనేకవిధములైన చిక్కుత్రోవలు వెక్కులు బోధించెడు మతగురువులు అమితములైయుండుదురు. మతములెన్నియైనను జీవుండును దేవుండును మోక్షమును యీమూడంశములును సర్వమతములకు సమ్మతమైనందున జీవునిమట్టును దేవునిగుట్టును రెండును వివరించి యీ మోక్షక్రియానుభవసూత్రంబుపదేశించి తానైనబ్రహ్మమును తనకు జూపించువాడే సర్వపరిపూర్ణుండైన సద్గురువనబడుచున్నాడుగాని, జీవబ్రహ్మైక్యానుభవమునెరుగక మాయాకల్పిత దుర్బోధలను జేయువారు సద్గురువులు కానేరరని తాత్పర్యము.

56. చూపువెలయజేసి సూక్ష్మంపువత్తిచే చిత్తమనెడిదివ్వెచెన్నుపరచి, పాపమనెడుతిమిర। మేపారబాపని పాపజాతిగురుడు పశువు వేమా॥ లోకంబున గురువనగా బ్రహ్మతత్వమును దర్శింపజేయువాడు. బ్రహ్మతత్వమనగా పంచవింశతి తత్వములకును పరతత్వమై సర్వదృశ్యములను తానుగ్రహించునదిగాని తానుదృశ్యమై కనుపించునదికాదు. అట్టిబ్రహ్మమును దర్శించుటకు గురువు తనశిష్యునకు చిత్తమనే ప్రమిదను స్థిరముజేసి భక్తియనెడు చమురును చాలబోసి శ్రద్ధయనెడు వత్తిని చక్కజేసి తెలివియనెడిదీపమును వెలయజేసి దృష్టియనెడి వెలుగును నిష్టతో నిలుపనేర్చిన బ్రహ్మమనెడు జ్యోతి ప్రకాశించి పాపమనెడిచీకటి పారిపోవును, ఇట్లు లోకంబున జీవులను బ్రహ్మత్వమును పొందించలేని గురువు శిష్యపాపమును తననెత్తినివేసుకొని తనపాపమును శిష్యుల పాపమును మొద్దువలె మోసుకొని యమునివద్దకు పోవుచున్నాడని తా॥

57. జ్ఞానమెన్నగురువు జ్ఞానహీనముబుద్ధి రెంటినందు రిమ్మరేచునపుడు। రిమ్మదెలసేనేని రెండికరూపురా ॥వి॥ గురుశిష్యులనగా

ప్రజ్ఞానస్వరూపంబైన ఆత్మయే గురువున్ను అజ్ఞానస్వభావంబైన బుద్ధియే శిష్యుడున్ను అయినందున అఖండవ్యక్తియైన ఆత్మకు అవిద్యావరణంబువలన అజ్ఞాన జీవత్వము సంభవించుచున్నది. కాబట్టి అజ్ఞానజీవుండైన ఆత్మ ప్రజ్ఞానబ్రహ్మమే తానని తన్ను తానెఱిగిన యెడల జ్ఞానాజ్ఞానంబులు రెండును ఆత్మయందైక్యమై గురుశిష్యులకేకత్వము సిద్ధించుచున్నదని తాత్పర్యము.

58. గురువునకు పుచ్చ కూరైన నియ్యరు । అరయవేశ్యకిత్తురర్థమెల్ల గురువువేశ్యకన్న కులహీనుడేమిరా ॥వి॥ లోకంబున మానవులకు సకలవిద్యలును గురుమూలముగా లభించునవిగాని గురువులేక దొంగవిద్యైనను దొరకబడదు. అందువలన చోరులకైనను గురుభక్తి కలిగియుండవలెను. సకలకార్యములయందు ముందుగా గురుప్రార్థనే చేయబడుచున్నది. బ్రహ్మాదిదేవతలు సైతము గురువుకంటె దైవములేదని, గురువుకంటె తపస్సులేదని, గురునికంటె ధ్యానములేదని, గురువుకంటె మోక్షములేదని గురువునే త్రిమూర్త్యాత్మక పరబ్రహ్మమని కొనియాడుచుందురు. ఇట్టిగురువుయందు విశ్వాసముంచి తోటకూరనైనను యివ్వలేక గురుబుద్ధివలన సంపాదించిన ధనమంతయు వేశ్యకు సమర్పించుట నరునియొక్క గుణహీనతయేగాని, గురునియొక్క కులహీనతగాదు కాబట్టి బుద్ధిమంతులు గురువిశ్వాసమును మరువక వేశ్యయందుంచిన భక్తిప్రపత్తులు, గురునియందుంచుటయే గురుసత్కారమగుచున్నదని తాత్పర్యము.

## జ్ఞానాజ్ఞానములు.

59. ఆదినొకతె దెలిసి ఆదినిమదినిల్పి । ఆదిబాయకున్న నధవుడగును । ఆదిబాయువాడు అంధకురీతిరా ॥వి॥ లోకంబున మానవులకు

అధిష్ఠానజ్ఞానమని, ఆరోపితజ్ఞానమని జ్ఞానము రెండువిధములై యున్నది. అందు అధిష్ఠాన జ్ఞానమనగా, ఆదిపరబ్రహ్మమైన ఆత్మయే తానని గ్రహించి యాపరబ్రహ్మమందు తనచిత్తముంచి ఆత్మబుద్ధితో ప్రవర్తించునది పరమార్థజ్ఞానమనిన్ని. ఆరోపితజ్ఞానమనగా నాదేహము నాప్రాణము నామనస్సు నాసంసారము అని మాయాకల్పిత నామరూప వికారంబులు ఆత్మయందారోపించుకుని దేహబుద్ధితో ప్రవర్తించునది లోకజ్ఞానమనిన్ని చెప్పబడుచున్నది. కాబట్టి ముముక్షుండైనవాడు మొట్టమొదటనే అధిష్ఠానజ్ఞానము గ్రహించి అధిష్ఠానమును పట్టువదలకుండిన పుట్టుచావని బ్రహ్మము తానగుచున్నాడనిన్ని, అధిష్ఠాన జ్ఞానము లేనియెడల ఆరోపిత జ్ఞానమునే అంధకారమందు గుడ్డివాడై కూలుచున్నాడనిన్ని తాత్పర్యము.

60. సత్యమమరియుండ జ్ఞానమమరియుండు । జ్ఞానమమరియుండ సత్యముండు । జ్ఞానసత్యములను సమమైన ద్విజుడగు ॥వి॥ లోకంబున మానవులకు సత్యజ్ఞానములు రెండును సహజములై యుండునవి గాని ఒకటిని విడచి యొకటి యుండనేరదు. గనుక మొదట సత్యమొకటి సమకూరియుండిన దానివెంటనే జ్ఞానము కలిగియుండును. మొదట సత్యమే లేనివానికి జ్ఞానముండనేరదు. సత్యమువలన జ్ఞానమును జ్ఞానమువలన సత్యమును సతీపతులవలె ఒకదానికొకటి సహాకారులై జీవునకిహపరసుఖంబులు కలిగించుచున్నవి. కాబట్టి లోకంబున మానవుడు సత్యజ్ఞానములను రెంటిని సమకూర్చి బ్రహ్మనిష్ఠుండై జీవన్ముక్తుండు కావలెనని తాత్పర్యము.

61. నిరతంబెడ తెగకుండగ పరిపూర్ణబ్రహ్మ మాత్మపదమున నుండగ। నిరవద్యమైనయడవిని జెరియించును జగమెరుంగ సత్యమువేమా॥ లోకంబున మానవుడు తనదేహమందు నిత్యపరిపూర్ణుడై యున్న

బ్రహ్మమును తానుగా తెలియనేరక దారాపుత్రాదులను విడచి విరక్తుండై విజనస్థలంబులకుబోయి అరణ్యారోదనము చేయుచుండిన ఉన్మత్తుండగునేగాని జీవన్ముక్తుండు గానేరడు. కాబట్టిబుద్ధిమంతుండైనవాడు గృహస్థుండై మతిబ్రష్ఠుండుగాక బ్రహ్మనిష్టుండై రాజయోగసుఖంబను భవించవలెనని తాత్పర్యము.

62. భయమునుమీాయజ్ఞానము। భయముడిగిన నిశ్చయంబు పరమార్థంబౌ। లయమునుమీా యీాదేహము। జయమునుమీా జీవుడను చు చాటరవేమా॥ లోకంబున మానవులకు దేహముతాననే జ్ఞానము కలిగియున్నను అది ఆరోపితజ్ఞానముగనుక అది జన్మ, మృత్యు, భయ కారణమైన అజ్ఞానమనబడుచున్నది, ఆత్మతాననే జ్ఞానము అధిష్టాన జ్ఞానముగనుక అది జీవన్ముక్తికారణమగుచున్నది. కాబట్టి దేహధారియైన జీవునకు అకల్పిత స్వయంబ్రహ్మమైన ఆత్మకెప్పుడును ఉత్పత్తి వినాశములు లేవనిన్ని, మాయాకల్పిత దేహమునకెప్పుడును ఉత్పత్తివినాశములు తప్పవనిన్ని, నిశ్చయించి, ఆత్మతానుగా గ్రహించిన జన్మమృత్యుభయమునశించి జీవన్ముక్తి సిద్ధించుచున్నదని తాత్పర్యము.

భ క్తి ముక్తు లు.

63. భక్తిగలుగుచోట ఫలమిచ్చుదైవంబు। భక్తిసలుపవలయు బ్రహ్మకైన। శివునియందు భక్తిచీమంతతప్పిన। కాదు కాదుముక్తికాదువేమా॥ లోకంబున సర్వజీవులకు దైవభక్తివలననే ధర్మార్థకామ మోక్షంబులు సిద్ధించుచున్నవిగాని దైవబలములేనివాని కేసుఖమున్ను గలుగనేరదు. బ్రహ్మాదిదేవతులు సైతము దైవబలముచేతనే దేవత్వముగలిగి శాశ్వతత్వమును పొందుచున్నారుగాని, బ్రహ్మాదులకైనను భక్తిలేక ముక్తిగలుగనేరదు, గనుక ముముక్షువులైన మానవులు మోక్షదాయకుడైన సర్వేశ్వరుని యిష్టదైవముగానమ్మి, సంపూర్ణభక్తి

సలుపుచుండిన యీశ్వరానుగ్రహబలంబున పాపరహితులై చిత్తశుద్ధిగలిగి జీవన్ముక్తిని పొందుచున్నారనితాత్పర్యము.

64. ప్రణవమెరుగకున్న భక్తుడెప్పుడుగాడు। జ్యోతినెరుగకున్న యోగిగాడు। నిత్యమెరుగకున్న నిర్వాణిగాడురా॥వి॥ లోకంబున ముముక్షువులకు భక్తియోగము ధ్యానయోగము జ్ఞానయోగము మూడును క్రమసాధనములైయున్నవి. అదియెట్లంటే "యీశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి" అనునట్లు సర్వజీవుల హృదయమందు ఓంకారస్వరూపుడైన శబ్దబ్రహ్మము ఆత్మారాముడై యున్నందున ఓంకారవాచ్యుడైన ఆత్మారాముని తనుగన్న తల్లివలె ప్రేమించి, అనవరతధ్యాన పూజనవందనార్చనములచే నారాధించునది భక్తియోగమున్ను, అటుపిమ్మట తననిజరూపమైన ఆత్మజ్యోతిని అంతర్లక్ష్యముచే దర్శించునదిధ్యానయోగమున్ను, అనంతరము అధిష్ఠానజ్ఞానముచే నిత్యానందకైవల్యమును పొందునది విజ్ఞానయోగమున్ను, అయినందునయీ భక్తిజ్ఞానయోగములుమూడును సాధించువాడేముక్తుడగుచున్నాడనితా॥

65. పూజసేయసేయ పూజారితానాయె। పూజవస్తువెన్న భువినితాను। యేడబూజసేయ నెల్లదిక్కులతాను॥వి॥ లోకంబున మానసపూజని, ఆత్మపూజని, పూజరెండువిధములు. అదెట్లంటే భగవద్భక్తుడైనవాడు శివకేశవులలో నొకరిని తనయిష్టదైవముగా నిశ్చయించి, యామూర్తిని విగ్రహరూపంబున భావించి యావిగ్రహమును బాహ్యమందుగాని అంతరమందుగాని స్థాపించి షోడశోప చారంబులచే పూజించునది మనస్సుగనుక అదిమానసపూజయనిన్ని ఆత్మపూజనగా సద్గురూపదిష్టజ్ఞానమువలన జీవబ్రహ్మైక్యమును గ్రహించి పరమాత్మతానై ప్రకాశించునది ఆత్మగనుక అది యాత్మపూజనిన్ని చెప్పబడుచున్నది. కాబట్టిజీవుండు దేవుని తెలిసిపూజించినను తెలియక పూజించినను

పూజను బొందుచున్న దేవుడు సర్వజ్ఞుడగుటవలన జీవుని పూజకు సంతోషించి జీవునియనుగ్రహించి తానే జీవబ్రహ్మైక్యమును పొందించుచున్నాడని తాత్పర్యము.

66. అడవిదిరుగ లేదు యాకసమున లేదు। అవని తీర్థయాత్ర లందు లేదు। ఒడలుశుద్ధిజేసి యొడయని జూడరా ॥వి॥ లోకంబున ముక్తియనగా సాలోక్యమని, సామీప్యమని, సారూప్యమని, సాయుజ్యమని, విదేహకైవల్యమని, పంచముక్తులుగలవు. వానిలో సాలోక్యాది ముక్తులు నాలుగును సగుణస్వరూపులైన శివకేశవులయందు గలుగునవిన్ని, విదేహకైవల్యమనగా అప్రత్యక్ష, ఆగంతుక, పునరావృత్తి దోషంబులు లేనిదిన్ని, సర్వాధిష్ఠాన పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మమందు యేకత్వము సహజమైయున్న సద్యోముక్తిన్ని అయినందున లోకంబున మానవులు విదేహకైవల్యపదమే పునరావృత్తి రహితశాశ్వత బ్రహ్మపదమని గ్రహించి బ్రహ్మవిద్యాభ్యాసము వలన స్వదేహమందే విదేహత్వము నొందవలెనని తాత్పర్యము.

67. మాటలుడుగకున్న మంత్రంబు నిలువదు। మంత్రముడుగకున్న మనసునిలదు। మనసు నిలుపకున్న ముక్తిలేదురా ॥వి॥ లోకంబున ముముక్షువులు ముందుమంత్రసిద్ధిబొంది యామంత్రసిద్ధివలన మనశ్శుద్ధిన్ని, మనశ్శుద్ధివలన జ్ఞానసిద్ధిన్ని, పొందవలసియున్నది. కనుక అత్యాతురముముక్షువులైన మానవుడు ముందు యింద్రియాలమైన యింద్రియవ్యాపారము వర్జించి వాఙ్మౌనము నవలంబించి గురుమంత్రము నుపాసించవలెను. అట్లు గురుమంత్రము సిద్ధించిన పిమ్మట మనోవ్యాపారమును త్యజించి, మనోమౌనము నభ్యసించి, యిష్టదైవమును ధ్యానించవలెను. అట్లు సగుణధ్యానము సిద్ధించిన పిమ్మట నిర్వాసన మౌనని

ష్టనభ్యసించి నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారమును పొందవలెనని తా॥

68. సర్వముతానని దెలసిన నిర్వాణికిగాక ముక్తి । నిలువగ వశమా యుర్వెల్ల తానుదిరిగిన । పర్వతబిలజలధులందుబడినను వేమా॥ లోకంబున ముక్తియనగా బ్రహ్మవిష్ణురుద్రాదులకధిష్ఠానమైన నిర్గుణపరబ్రహ్మమందు తనకు సహజమైయున్న యేకత్వముగాని తానొకవస్తువులోగలసి ఐక్యమగుట కానందున ముముక్షుండైనవాడు సర్వజీవయంత్రంబులలోనున్న సచ్చిదానంద బ్రహ్మము తానని గ్రహించి వైరాగ్యబోధోపరతులవలన సచ్చిదానంద బ్రహ్మమును దర్శించి సర్వాధిష్ఠానపరిపూర్ణ సచ్చిదానంద మయుడుతానై ప్రకాశించువానికే విదేహకైవల్యము సిద్ధించునదిగాని బ్రహ్మవిద్య నభ్యసింపనేరక భూసంచారము చేయువానికిన్ని పర్వతగుహాలయందు వసించువానికిన్ని సిద్ధించునదిగాదని తాత్పర్యము

69. ఏకబ్రహ్మము నిత్యము। వైకల్పితమైన యట్టివస్తువులెల్లన్ యేకత్వంబని యెరిగిన।శోకము లేనట్టిముక్తి సులభము వేమా॥ లోకంబున మానవులకు ముక్తియెట్లుసిద్ధించుననగా, యీదేహాది ప్రపంచవస్తువులన్నియును సువర్ణమందాభరణంబుల వలెనే బ్రహ్మమందు కల్పితమైనందున, సర్వాధిష్ఠాన పరబ్రహ్మవస్తువొక్కటియే సత్యమనిన్ని సర్వాభరణంబులును స్వర్ణమయమేయైనట్లు సర్వవస్తువులున్ను బ్రహ్మమయములైనందున జీవుడైతానున్ను బ్రహ్మమయుడేయనిన్ని నిశ్చయజ్ఞానముగలవానికి సర్వదుఃఖనివృత్తియైన సద్యోముక్తి స్వతస్సిద్ధమైయున్నదని తాత్పర్యము.

## మనస్సు.

70. మనసనిలము రెంటికినీ। ఘనమును కొంచంబుదెలియగా వశమువిమా॥ కనుమూసి తెరచినంతన ఘనమైవిహరించుమనసు గాన

రు వేమా॥ లోకంబున జీవులబంధమోక్షంబులకు మనోమారుతములు కారణమైయున్నవి. అదెట్లంటె వాయువువలన మనస్సున్ను, మనస్సువలన యింద్రియంబులును యింద్రియంబులవలన దేహమున్ను చలించి ఆత్మను భ్రమింపజేయుచున్నవి. వాయువు కుస్వరూపము కనుపించకున్నను చలనస్తంభనాదులవలన స్వభావముగనుపించుచున్నట్లు మనస్సునకు స్వరూప మగుపించకున్నను కన్నుమూసినప్పుడతిసూక్ష్మమైయంతరించి, కన్నుతెరచినమాత్రమునే బ్రహ్మాండాకారమై పరిణమించి సర్వజగత్తును గల్పించి జీవులను జగన్మాయలో ముంచుచున్నది. కాబట్టి ముముక్షుండైన జీవుండు యింద్రియములకు రాజు మనస్సనిన్ని, మనస్సునకు రాజు మారుతమనిన్ని గ్రహించి మనోమారుతంబుల రెంటిని ఆత్మయందైక్యము జెందించవలెనని తాత్పర్యము.

71. మాటదిద్దవచ్చు మరియొగ్గులేకుండ। దిద్దవచ్చురాయి తిన్నగాను। మనసుదిద్దరాదు మహినెంతవారికి॥ వి॥ లోకంబున మానవులు తమ వాక్ప్రసంగములయందపశబ్దములుంశిన వానిని సుశబ్దములుగా దిద్దవచ్చును, హెచ్చుతగ్గులుగానున్న రాతిని సమానముగా సమను జేయవచ్చును, గాని మర్కటమువలె చలించుచున్న దుష్టమనస్సును బట్టి వశపరుచుకొనుట యెంతశూరునకైనను ప్రాణాంతమేయగుచున్నది. గనుక ముముక్షువులైనబుద్ధిశాలులు 'యింద్రియాణిజయశ్శూరః' అనున్యాయంబున మనస్సనెడి మర్కటమునుబట్టి భక్తియనెడు పగ్గమునుజుట్టి దైవమనెడు స్తంభమునగట్టి మహాశూరులై మనోనిగ్రహము జేసిన మాయజీవభ్రాన్తి మటుమాయమగుచున్నదని తాత్పర్యము.

72. ఏవంకమనసుబారిన యావంకకు నింద్రియంబు లన్నియు నేగు॥ నీవంక మనసుబారిన యేవంకకు నింద్రియంబు లేగవువేమా॥ లోకంబున జీవులకు దేహేంద్రియ వ్యాపారములన్నియు, మనస్సువల్లనే

జరుగుచున్నవిగాని, మనస్సులేనప్పుడు దేహేంద్రియంబులు జడంబులై వ్యాప్తిఁ జెందుచున్నవి. మనస్సనెడు రాజును యింద్రియంబులు భటులై తానేవిషయమందు వర్తించిన భటులు తనవెంటనే దిరుగుచుందురు, గనుక ముముక్షుడనువాడు మనస్సనెడి రాజును లోకవిషయములనుండి మరలించి, పరమాత్మవిషయమందు ప్రవర్తింపఁజేసిన సర్వేంద్రియంబులును, తనవశంబులై స్వస్థానమందే నిలచియుండునని తా॥

73. మనసులోనఁ దలఁచి మనముతో నెకలసి। మనసులోనివాని మరలఁదిగిచి। మనసు నిల్పినందు మరలజగముండు తా॥ వి॥ లోకంబున ముముక్షువైన జీవుండు తననిజరూపము సత్యజ్ఞానానంద స్వరూపము గాని అనృతజడదుఃఖ స్వరూపంబు గాదని తనమనస్సులో తానే తెలిసి నేననే అహంవృత్తిని సోహమనే ఆత్మయందు గలిపి నిరహంకారుఁడై బ్రహ్మత్వము జెంది జీవన్ముక్తిస్థితియందు తానుండ నేర్చినట్టి జీవన్ముక్తునకు బ్రహ్మసత్యత్వమున్ను జగన్మిథ్యాత్వమున్ను రెండును ప్రత్యక్షగోచరమగుచున్నదని తాత్పర్యము.

74. ఒక్కమనసుతోడ నున్నదిసకలంబు। తిక్కఁబట్టినరులు తెలియలేరు। తిక్కనణఁగినపుడు నొక్కటే చాలు తా॥ వి॥ లోకంబున మానవులు ఆత్మయందు మనసు నిలిచినపుడు బ్రహ్మత్వమున్ను చలించినపుడు జీవత్వమున్ను మనస్సువల్ల నేకలుగుచున్నవని తెలియక మోక్షము కొరకు వృథాప్రయాస పడుచుందురు. భక్తిజ్ఞానవైరాగ్యంబులు, ప్రధానములైనను, యేకాగ్రచిత్తములేనివానికి జీవన్ముక్తి సిద్ధింపనేరదు ఉత్తమశ్రద్ధగలిగి యేకమనస్సుతో నుండినవానికే సాధన మక్కరలేదు. కావున ముముక్షువైనవాడు మరుగువద్ద కొంగ మచ్చముకై మనసు నిల్పినట్లు, ఆత్మయందు మనసునిల్పి నిశ్చలముగా నుండిన యాతనిలోని నిశ్చలత్వమే జీవన్ముక్తి యగుచున్నదని తాత్పర్యము.

75; తలపుచేతగ ల్గు తారకబ్రహ్మంబు। తలచిచూడతాన త త్వమగును।తలపులోనె తలపుతానె తానెఱిగిన॥వి॥-లోకంబున సర్వజీవయుంత్రంబులును అంతఃకరణమనే మాయవలన ఆత్మయందు కల్పింపబడు చున్నవి. ఆయంతఃకరణము మనస్సని, బుద్ధియని, చిత్తమని, హంకార మని, నాలుగువిధములై జగన్నాటకము నాడించుచున్నది. ఆసంకల్పశక్తియైన మనస్సు బ్రహ్మమందు లేనిప్రపంచమును కల్పించుచున్నది. కనుక మనస్సే మాయనిన్ని, ఆప్రకృతి బుద్ధిరూపమై ఆత్మయందహం వృత్తిని బుట్టించుచున్నది గనుక తలపే సంసారమనిన్ని, ఆప్రకృతి చిత్తరూపమై యాత్మను చలింపజేయుచున్నది గనుక చిత్తమే ప్రపంచమనిన్ని, అప్రకృతి హంకారరూపమై ఆత్మకు కర్తృత్వము గలిగించుచున్నది గనుక హంకారమే జీవుడనిన్ని చెప్పబడుచున్నది. కాబట్టిదేహధారియైన జీవుడు తన యంతఃకరణమందు జనించెడు తన తలపులో సాక్షియై గోచరించుచున్న బ్రహ్మము తానని గ్రహించినయెడల తారకబ్రహ్మము తానై ప్రకాశించు చున్నాడని తాత్పర్యము.

76 తలచిన తత్వంబగునా। తలపక దానూరకున్న తత్వంబగునా తలపును తలపమి రెండును। తలపములోనుండెనేని తత్వమువేమా. లోకంబున జీవుడు బ్రహ్మత్వము నొందుటకు "అహంబ్రహ్మాస్మి" యని తనమనస్సులో తలచుచుండినను తాను బ్రహ్మముకానేరడు, అట్లుతలచక యూరకుండినను బ్రహ్మము కానేరడు. గనుక ఆవరణవిక్షేపంబులైన తెరపుమరుపుల రెంటికిని సాక్షియైనబ్రహ్మము తానని తన తలపులో నిలుపుకొనుటయే తనకు బ్రహ్మత్వసిద్ధి యని తా॥

చూ పు

77. ఇట్టికనుఁబ్రహ్మ మెట్లు చూడగవచ్చు। చూచుకనులువేరు చూపువేరు। చూపులోన మలచిచూడంగవలవదా॥వి.లోకంబున మా

నవ్వులకు దృశ్యవస్తువులను జూచునది చర్మచక్షువనిన్ని, అదృశ్యవస్తువులను జూచునది జ్ఞానచక్షువనిన్ని. దృష్టి రెండువిధములై యున్నది. జగచ్చక్షువైన బ్రహ్మమును జ్ఞానచక్షువే దర్శింపవలెనుగాని చర్మచక్షువులు దర్శింపనేరవు. కాబట్టి జీవుండు జగద్వ్యాపమైన తన మనోదృష్టిని జగచ్చక్షువైన బ్రహ్మమందభిముఖము జేసి విజ్ఞాననేత్రముతో జూడనేర్చిన ప్రజ్ఞానబ్రహ్మము కనుపించుచున్నదని తా॥

78. నిన్ను జూచెనేని తన్నుదామరచును । తన్ను జూచెనేని నిన్నుమరచు । యేవిధమున జనుండెరుగు నిన్నునుదన్నును వి॥ లోకంబున సూర్యబింబమునకును ప్రతిబింబమునకును అజ్ఞానదృష్టికి భిన్నత్వమున్ను, జ్ఞానదృష్టికి యేకత్వమున్ను, యెట్లుగనుపించునో జీవబ్రహ్మలకు యేకత్వభిన్నత్వంబులట్లు గనుపించుచుండును. మనము సూర్యబింబమును జూచునపుడు ప్రతిబింబమున్ను, ప్రతిబింబమును చూచునపుడు సూర్యబింబమున్ను యెట్లుకనుపించకుండునో బ్రహ్మముతానై యున్నప్పుడు జీవుడు తాననే అజ్ఞానమున్ను, దేహముతానై యున్నప్పుడు దేవుడు తాననే విజ్ఞానమున్ను కనుపించకుండును, కావున ముమూక్షువులు దేవుడు తానని యెరుగునదిన్ని దేహముతానని యెరుగునదిన్ని బ్రహ్మవస్తువొక్కటియేగాని రెండువస్తువులు లేవని గ్రహించుటయే జీవేశ్వరుల నెరుగుట యని తా॥

## ఆశ.

79. ఆశచేత మనుజు లాయువుగలనాళ్లు। దిరుగుచుందురు భ్రమద్రిప్పలేక । మురికిభాండమునందు ముసరు నీగలభంగి ॥వి॥ లోకంబున మానవులు, మలభాండంబునకు మక్షికంబులాశ్రయించునట్లు, జిహ్వోపస్థాది తుచ్ఛవిషయంబుల కాశించి విషయవాంఛల విడువలేక తమజీవి

తకాలము తుచ్ఛవిషయంబులకే వినియోగింతురు. కావున బుద్ధిమంతులు విషయంబులకు భ్రమింపక ఆశాపిశాచమును తొలగించి మృత్యువును జయించి మోక్షమును పొందవలెనని తా॥

80. ఆశ విడకగాని పాశముక్తుడు గాడు । ముక్తుడైనగాని మునియుగాడు। మునికిగాని సర్వమోహంబు లూడవు॥ వి॥ లోకంబున మానవుడు విషయాశచేతను పాశబద్ధుడగుచున్నాడు గనుక ఆశ, సంశయము, భయము, లజ్జ, చింత, కులము, మతము, ఆచారము అనునీ అష్టపాశములును తెగినప్పుడుగాని బంధముక్తుడు గాడు. అట్లుప్రతిబంధ విముక్తి నొందినప్పుడుగాని బ్రహ్మనిష్ఠ కుదురుపడదు. అట్లు మాననిష్ఠ యందు నిలకడ కలిగినప్పుడుగాని జీవభ్రాంతి తొలగనేరదు. అట్లు భ్రాంతి తొలగిన జీవుడు బ్రహ్మము తానయగుచున్నాడని తా॥

కపటము

81. మాటలాడవేరె మనసు కొలదియువేరె। యొడలిగుణమువేరె యోజవేరె। యెట్లుగలుగుముక్తి యేలాగు తనలాగు ॥వి॥ లోకంబున జీవుండనేక జన్మవాసనలచేత అతిమాయకుడై మహేంద్రజాలిక కృత్రిమ తంత్రంబులు నేర్చి కుటిలస్వభావుండై వాక్కున వచించునది యొకటి మనస్సున యోచించునది మరియొకటి తననైజగుణ మింకొకటి క్రియకాచరించునది వేరొకటి యిట్టి యుద్దండ పాండిత్యంబువలన పరులను మోసపుచ్చి బ్రతుకనేర్చుటయే మహాప్రౌఢత్వమని ప్రవర్తించుచున్నకపటాత్మునకు నరకప్రాప్తిగాక మోక్షప్రాప్తి యెట్లగును? తనకుటిల స్వభావమైన కపటము, గర్వము, రాగము, ద్వేషము, కామము, క్రోధము, మదము, మత్సరము, లోభము, మోహము, దంభము దర్పము, యీర్ష్య, అసూయ, జార, చోర, హింసాది క్రూరకృత్యంబులు

య్యెప్పుడునశించునో అప్పుడు గాని జీవన్ముక్తి సిద్ధించ నేరదు. కాబట్టి మానవజన్మమెత్తిన జీవుండు తనమాయా వికారంబులైన దుర్గుణంబు లన్నింటిని నిర్మూలము జేసి ఆత్మధర్మంబులైన అక్రోధము, ఔదార్య ము, నిర్లోభము, నిష్కపటము, వినయము, విశ్వాసము, వితరణము విరాగము, సమానము, సంతోషము, దయ, దాక్షిణ్యము యీమొదలైన సద్గుణములను సంపాదించి మాయను జయించిన ముక్తిని బొందుచున్నాడని తా॥

82. నోసలు బత్తుడయ్యె నోరుతో డేలయ్యె । మనసు భూతము వలె మలయగాను । శివుని గనియెనన్న సిగ్గులుగాదొకో॥వి॥ లోకంబున కపటజీవులకు ముఖమునందు వికాసమున్ను వాక్కునందు మాధుర్య మున్ను వర్తనమందు వినయమున్ను హృదయమందు కుత్రిమమున్ను సహజమై యుండుటవలన అట్టివాడు గోముఖవ్యాఘ్రమువలె నటించు చు నోరుభక్తుడై హరినిస్మరించుచున్నను దొంగబుద్ధితో డేలువలె విష యాదులతో వెడకుచుండును. కనుక ముముక్షువైన జీవుండు “దొంగ మాటలాడ దొరకునా మోక్షంబు” అను హితోక్తిని గ్రహించి తనక పటస్వాభావము నిష్టురవును వర్జించి పరోపకారము, భూతదయ, భగ వద్భక్తి, సాధుసేవ యీమొదలైన సద్గుణంబుల నభ్యసించి నిష్కపట చిత్తంబున నిజభక్తుడుగావలెనని తా॥

చదువు

83. ఎన్నాళ్లును దానుండును। యెన్నాళ్లును తాను నేర్చ యెన్ని టవెలయున్। కొన్నాళ్ల కుజాజన్ను ను మన్నా యెను విద్యలెల్ల మహి వేమా॥ లోకంబున మానవుడు తానన్నివిద్యల నభ్యసించినను యెన్ని భోగంబులనుభవించినను యెంతకాలము జీవించినను కొంతకాలమునకు

తాను మరణించక తప్పదు. తాను మరణించినప్పుడు తనవిద్యావినోదములన్నియు తనతోడనే నశించి మాయవిద్యలు మంటగలసి పోవునవే గాని తన్ను నిలుపునవిగావు. ఉత్తమజన్మమెత్తినందుకు ముక్తినిపొందుట సార్థకముగాని మృతమైపోవుట సార్థకముగాదు. కాబట్టి బుద్ధిమంతుడైన మానవుడు తనకు దేవునిగుట్టు దెలుపునదిన్ని తన్ను దేవునియందు గలుపునదిన్ని యేబ్రహ్మవిద్యగలదో, యామహావిద్యనే తానభ్యసించి యామహానందమునే తాననుభవించి మహోన్నతపదమునే పొందవలెనని తా॥

84. చదువుచదువనేల సన్యాసిగానేల। షణ్మతంబులజిక్కి చావనేల। యతని భజనజేసి యాత్మనే దెలియరా॥వి॥ లోకంబున మానవుడాత్మవిద్యనెఱుగక మాయవిద్యలు నేర్చుటవలన మతపంకము తలకెక్కుటయు, యామతపంకమువలన సన్యాసములో ప్రవేశించుటయు, అట్లుసన్యసించినను తనమాయవిద్యా పిశాచము తన్నువదలక తుదకు మృత్యువునోట వేయించుటయు, అప్పుడుతాను చింతించుటయు, నిష్ఫలము గనుక బుద్ధిమంతుడైనవాడు మొట్టమొదటనే మాయచదువులను మాని ఆత్మవిద్యనుబూని ముక్తికాంతను గావవలెనని తా॥

సంసారము.

85. గతము చూతమంటె కలగన్నయర్థంబు। నడచుకార్యమేమి నమ్మరాదు। క్షణములోనిబ్రతుకు సంసార విభ్రాంతి ॥వి॥ లోకంబున జీవులకు సంసారము రెండువిధములు. ఒకజన్మమునందు దారాపుత్రాదులతో ప్రవర్తించుచున్న సంసారము చిన్నవదివంటిదిన్ని యిట్లనేకకోటిజన్మములందు నర, మృగ, పశు, పక్ష్యాది శరీరంబులతో గూడి చచ్చిపుట్టుచున్న సంసారము మహాసముద్రమువంటిదిన్ని అయ్యు

స్నవి. యదార్థము విచారించిన సంసారమనగా, అకల్పిత స్వయంబ్ర హ్మమైన ఆత్మయందు మాయాకల్పిత దేహేంద్రియాదులవలన దారాపుత్రాది సంబంధము అడవియుసిరిక సముద్రలవణమువలె ఆగంతుకముగా సంభవించినదిగాని అసంగచిద్రూపుండైన ఆత్మకు దేహేంద్రియాది సంబంధము కాలత్రయమందు సత్యముగా లేదు. కాబట్టి దేహధారియైన జీవుండు నేటివరకు తాననుభవించిన సంసార సుఖమంతయు స్వప్నతుల్యమై పోవుటవలన నేటినుంచి తాననుభవించునదిన్ని మిథ్యాభూతమేయని నిశ్చయించి తనజన్మము, జీవితము, అనుభవము, ఆనందము, పౌరుషము, పరాక్రమము, యీమొదలైన నామరూపములు మాయాకల్పితములుగా గ్రహించవలెనని తా॥

86. ఇది నాకువలవదనుచును। వదలక మదిలోనన్నైన వస్తువులభ్రమల్ । గడసి విడనాడకుండిన। నదియే సంసారబీజ మందురు వేమా॥ లోకంబున జీవునకు మాయాప్రపంచమూలంబైన కాంతాకనకంబుల యందలి మనోవిభ్రాంతి యెంతవరకు వదలకుండునో అంతవరకు సంసారబీజమంకురించుచునే యుండును. మాయాకల్పిత ప్రపంచవస్తువులు బ్రహ్మమైన తనకు మిథ్యాభూతములని తన మనోవిభ్రాంతిని తానెప్పుడు విడచునో అప్పుడు లింగదేహ బీజాంకురము నశించును. గనుక ముముక్షుండైనవాడు తనయాత్మయందారోపితమైనసకలవస్తు వాంఛలనున్ను మాయాకల్పిత మనోవికారములని త్రికరణశుద్ధిగా త్యజించి మరల యేవస్తువు నిచ్ఛయింపక తనఆత్మవస్తువునే తాను ప్రేమించి తనయందు తానే రమించుచుండవలెనని తా।

సన్యాసము

87. హృదయము పదిలంబైతే । గుదిగొని సన్యాసమునకు కామ్యములుగలవా। యిదియెరుగరు చదువయ్యలు। మదిముక్తికి నాశ్రయం

బు మహిలో వేమా॥ లోకంబున మానవులు జీవన్ముక్తి కొఱకు భక్తి జ్ఞానవైరాగ్యంబులచేత పరిపక్వమైన మనస్సే ప్రధానంబని తెలియక బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమంబు లొకదానికంటె నొకటి శ్రేష్ఠంబులనుచు బ్రహ్మచారులు గృహస్థాశ్రమంబును గృహస్థులు వానప్రస్థాశ్రమంబును, వానప్రస్థులు యత్యాశ్రమంబును స్వీకరించుచు ఘటాంతమందు మోక్షము సిద్ధించునని బహుప్రయాసంబులు పడుచుందురు. గాని మాయాకల్పిత నామరూప వర్ణాశ్రమంబులు స్వీకరించుటచేతనున్ను నిరాకరించుటచేతనున్ను మోక్షము మాత్రము సిద్ధించునదికాదు. కాబట్టి ముముక్షువులైన బుద్ధిమంతులు తామేవర్ణాశ్రమమందుండినను, బంధమోక్ష కారణంబైన తమమనంబును భగవద్భక్తియోగంబువలన పరిపక్వంబుజేసి ఆత్మజ్ఞానాంజనంబువలన జీవన్ముక్తిని పొందింపవలెనని తా॥

88. కావిపంచగట్టి కనుయోగినవలెనుండు। వెలికి కోర్కెలెల్ల విడిచి పెట్టి। తొడరి తిరుగువాడు దొంగసన్యాసిరా॥ వి॥ లోకంబున మానవుడు చపలచిత్తుడై కామక్రోధమదహంకారంబులచే దారాపుత్రులతో కలహించి మూఢవైరాగ్యంబున తత్తరపడి సన్యసించిన అత్యాతురవైరాగ్యంబంతట నశించి అయ్యోమనమేల వెర్రిపడి దారాపుత్రులకు దూరమైతిమిగదాయని సంసారమమకారమును వదలలేక మోహపాశంబున గట్టువడి తుదకే వేషమైన నుదరపోషణకే యని నిశ్చయించి మంచికాషాయ వస్త్రమును ధరించి చక్కని రుద్రాక్షమాలిక లలంకరించి సొగసైన దండకమండలంబులను గ్రహించి చిత్తంబున కాంతాకనకంబుల కెక్కింపుచు పైకి వేదాంతవాక్యంబులు ప్రసంగింపుచు కపటవేషంబున సంచరించువాడు యిహపరంబులరెంటికిని దూరమై పశుపక్షి మృగాదులవలెనే అధోగతిని బొందుచున్నాడని తాత్పర్యము.

89. వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి। భ్రమలబెట్టి తేటబడగనీయవు గుప్తవిద్యయొకటి కులకాంతవంటిది ॥వి॥ లోకంబున వేదవిద్యలు వేశ్యలవంటివనిన్ని బ్రహ్మవిద్య పతివ్రతవంటిదనిన్ని చెప్పిన కారణము విచారింపగా లోకంబున వ్యభిచారవృత్తిగల స్త్రీపురుషులకు జారచోర శిఖామణులందరును తమ ప్రియులే అయ్యుందురు. అట్టి వ్యభిచారులకతివ్యాప్తి దోషముచే, దేహమనోశక్తులు నశించుటవలన సత్యజ్ఞానవంతులు కానేరరు. అటువలెనే వేదశాస్త్రములు చదివినవాలదిని విద్యాగర్వము తలకెక్కి సంశయాత్ములై బ్రహ్మనిష్ఠకు పాత్రులుగాక కుతర్కవాదముచే మతిభ్రష్టులగుచుందురు. ధర్మపత్నీసమేతులైన పుణ్యాత్ములు ఋతుకాలమందు మితముగా రతిసల్పుటవలన యాదంపతులు నిష్కాములై సత్యజ్ఞానధర్మంబులకు సమర్థులగుచుందురు. అటువలెనే పరమగోప్యమైన బ్రహ్మవిద్య నభ్యసించినవారికి భక్తిజ్ఞానవైరాగ్యంబులు ప్రబలించి సంశయవిపర్యయంబులు నశించి, సర్వభోగ సంతుష్టినిగలిగించి మోక్షసామ్రాజ్యమును పొందించుచున్నదని తాత్పర్యము.

90. ఇహమున సుఖయింప హేమకారకవిద్య। పరమున సుఖయింప బ్రహ్మవిద్య। రెండుగానిదియెల్ల రండముండలవిద్య ॥వి॥ లోకంబున మానవులకు ధనాకర్షణవిద్యవలన యిహసౌఖ్యమున్ను పరబ్రహ్మవిద్యవలన మోక్షసుఖమున్ను కలుగుచున్నందున తక్కిన విద్యలధమ విద్యలని చెప్పబడుచున్నవి. కావున బుద్ధిమంతులైన మానవులు క్షణభంగురమైన విషయసుఖము కొరకు ధనాకర్షణవిద్యకు దక్కి మృత్యువునోట జిక్కక శాశ్వత సుఖంబైన బ్రహ్మవిద్య నభ్యసించి జన్మమృత్యు సంసారసముద్రమును తరించవలెనని తాత్పర్యము.

91. నిద్రహీన నిష్ఠ నిలకడ దెలిసిన। భద్రమైన విద్య బ్రహ్మవిద్య। నిద్రదెలియువాడు నిర్మలయోగిరా ॥వి॥ లోకంబున బ్రహ్మవిద్యనగా

శ్రవణమనన నిదిధ్యాసన సమాధుల వలన బ్రహ్మనిష్ఠుండై బ్రహ్మానంద సుఖమనుభవించునది గాని వేదాంతశాస్త్రము చదువుకొని సంతోషించునదిగాదు. శ్రవణమననము లనగా, శ్రుతియుక్తి దృష్టాంతములచే వినబడిన బ్రహ్మము తానని తన తెలివిచేత తెలివిని గ్రహించునది శ్రవణమునిన్ని; అట్లుగ్రహించిన తెలివి బ్రహ్మమందు నిలిపి తన్నుతాను మరువక విమర్శించునది మననమునిన్ని; అట్లువిమర్శింపబడిన బ్రహ్మమందు తన సంకల్పరూపమైన అహంవృత్తిని రమింపజేయునది నిదిధ్యాసన మనిన్ని; అట్లుబ్రహ్మమైన తనయందు సంకల్పవృత్తులయించి స్వరూపస్మృతి గలిగి దేహవిస్మృతి జెందియుండినది సమాధి యనిన్ని చెప్పబడుచున్నవి. కాబట్టి ముముక్షుండైనవాడు శ్రవణ మనననిదిధ్యాసన సమాధుల నభ్యసించి యోగనిద్రాపరాయణుడై మాయనిద్రను జయించి జాగరూకుడై బ్రహ్మనిష్ఠయందుండుటయే బ్రహ్మవిద్యనితా॥

92. దోసమట్లువంటి తుర్యమందాత్మను జూచి యాసలనటుగోసివేసి । వాసనలుడిగిన వాడెపో బ్రహ్మంబు॥ వి॥ లోకంబున జీవులకు జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తురీయము, అని నాలుగవస్థలు గలుగుచున్నవి. అందుజాగ్రదవస్థనగా మనస్సు, యింద్రియములతోగూడి విషయములందు ప్రవర్తించునదిన్ని, స్వప్నావస్థనగా మనస్సు, అంతర్ముఖమై విషయవాసనలను కల్పించునదిన్ని, సుషుప్త్యవస్థనగా మనస్సులయించి విషయానుభవములేక ఆత్మమాత్రము శేషించునదిన్ని, తురీయావస్థనగా జాగ్ర, త్స్వప్న, సుషుప్తుల నతిక్రమించి సాక్షిమాత్రముగా నుండునదిన్ని అయినందున సమాధినిష్ఠులకు తప్ప తక్కినవారికి తుర్యావస్థ అనుభవింపబడుటలేదు. కాబట్టి ముముక్షుండైన జీవుండు అతిసూక్ష్మప్రజ్ఞారూపంబైన తురీయావస్థ నభ్యసించి అవస్థాత్రయమాయ నతిక్రమించి స్వస్వరూపంబైన కేవలాత్మను దర్శించి దేహవాసనా శా

త్రవాసనా లోకవాసనలను ఖండించినిర్వాసనమాన నిష్ఠయందు నిలిచినవాడే బ్రహ్మవిద్వరిష్ఠుండని తాత్పర్యము

## రాజయోగము.

93. రేచకపూరకకుంభక సూచకముల రాజయోగ సుస్థిరమతివై లోచూపుచూడనేరక వాచాబ్రహ్మంబుపలుక వలదురవేమా!

రాజయోగమనగా అజ్ఞాన జీవహంసను సుజ్ఞానరాజహంసను జేయునది యనియర్థము జీవహంసనగా అచలపరిపూర్ణమైన పరమాత్మ ప్రాణాపానంబులతో గూడి రేచకపూరకంబులచే చలించుచు సోహం శబ్దమువలన హంసయై బ్రహ్మము నేనని పలుకుచు దేహముతానని భ్రమించుచున్నది. అందువలన సకలజీవులును హంసస్వరూపులై స్వస్వరూపమును మరచియున్నారు. కాబట్టి రేచక పూరకంబులచే చలించుచున్న జీవహంసను కుంభకముచేత కుదురుపరచిన తాను పరమహంసయై బ్రహ్మత్వమును పొందుచున్నదిగాని నేనేబ్రహ్మమని నోటవదించుటవలన పొందనేరదని తాత్పర్యము.

94. పగలు రేయిమరచి భావంబుమరిచియు! తాను నేనని యెడి తలపుమరచి రాజయోగమందు రంజిల్లుచుండరా వి॥ రాజయోగము సాంఖ్యతారక అమనస్కంబులని మూడంగములు గలిగియున్నది. అందు సాంఖ్యమనగా మాయాబ్రహ్మములను రెంటిని విమర్శించునది న్ని తారకమనగా యీమాయను భేధించి బ్రహ్మమును దర్శించునది న్ని అమనస్కమనగా బ్రహ్మముతానై ప్రకాశించునదిన్ని అయినందున మముక్షుండైన జీవుండు సాంఖ్యతారకా మనస్కభావంబులను గ్రహించి జాగ్రన్నిద్రారూపంబైనదివారాత్రంబుల మరచి అహంకారమకారస్వరూపంబైన సంకల్పంబులను విడచి దేహప్రపంచ రూపంబై

న మాయను దెలసి సర్వాధిష్ఠాన పరిపూర్ణ పరబ్రహ్మమాత్రుఁడై యానందించుటయే పరమ రాజయోగమని తా॥

95. ఊరకుంటదెలియ నుత్తమయోగంబు । మానసంబుకలిమి మధ్యమంబు। ఆసనాదివిధులు అధమయోగంబు రా వి॥ లోకంబున బ్రహ్మవిద్యకు శ్రవణమనన నాదు లారంభవిధులున్ను, యమనియమాదు లభ్యాసవిధులున్ను సాంఖ్యతారకామనస్కంబు లారూఢవిధులున్ను అయినందున, ముముక్షువులు మొదట దేహశుద్ధికొరకు పద్మాసన సుఖాసనంబుల నభ్యసించి మనశ్శుద్ధికొరకు శ్రవణమననాదుల నవలంబించి మోక్షసిద్ధికొరకు సవికల్ప నిర్వికల్ప సమాధులను సాధించి, తుదకు మనోరహితుఁడై మవునము జెందుటయే రాజయోగమని తా॥

96. ఎండచీకటులకు నిమ్ముగా నుండెడు నిండుకుండలోన నిద్ర మరచి, యుండువానినెంచ నుత్తమయోగి రా వి॥ లోకంబున జీవులకు దివారాత్రములెట్లు దెలియబడుచున్నవి? పగలు సూర్యుని చేతనున్ను రాత్రి దీపముచేతనున్ను దెలియబడుచున్నవి. ఆసూర్యాగ్నులెట్లు దెలియబడుచున్నవి? నేత్రములచే దెలియబడుచున్నవి. ఆనేత్రదృష్టి దేని వలన తెలియబడుచున్నది? బుద్ధిచేత దెలియబడుచున్నది. ఆబుద్ధి దేని వలన గ్రహింపబడుచున్నది? ఆత్మచేత గ్రహింపబడుచున్నది. ఆయాత్మయెట్లు గ్రహింపబడుచున్నది? ఆయాత్మ స్వయంబ్రహ్మమైనందున సర్వమును తానేగ్రహించుచున్నది. కాబట్టి ముముక్షుండైన జీవుండు చీకటివెలుగులకు అధిష్ఠానమై గ్రహించుచున్న అచలపరిపూర్ణబ్రహ్మమందు నిలచి నిద్రజయించి బ్రహ్మమయుఁడై ప్రకాశించవలెనని తా॥

97. మనసు వాక్కు కర్మ మరియేమిలేకను । రాకపోకలేని రాజవీధి పరగహానిగలదె పరతత్వయోగికి ॥వి॥ లోకంబున బ్రహ్మవిద్యారూఢుండైన జీవన్ముక్తునకు సంకల్పరూపంబైన మనస్సున్ను శబ్ద

రూపంబైన వాక్కున్ను క్రియారూపంబైన కర్మయున్ను, యివి మూడును త్రికరణములని లోకంబున మూడుపనియుట్లై సర్వకార్యములును యీత్రికరణములచేతనే చేయబడుచున్నవి. గనుక మాయాకల్పిత జగత్కారణములైన యీత్రికరణములు జీవన్ముక్తికి ప్రతిబంధములై నందున మనోవాక్కర్మలను మూడింటిని నిర్మూలము జేసి పరిపూర్ణ చిదాకాశమందున్న బ్రహ్మైక్యమనకు పునరావృత్తిరహిత శాశ్వత విదేహకైవల్యము స్వదేహమందె స్వతస్సిద్ధమై యున్నదని తా॥

98. మదినిగానలేరు మరిబ్రహ్మమూర్తిని మదినిగన్నవారు మహిని లేరు వెదకితనువులోన వేడ్కతో నరిగిన అతడెయోగివరుడు యండ్రువేమ॥ లోకంబున జీవులు మాయాకల్పిత నామరూపము లన్నిటిని మనస్సుచేత జూడనేర్తురుగాని అకల్పిత స్వయంవ్యక్తమైన పరబ్రహ్మమూర్తిని జూడనేరరు. యెందుచేతననగా, పరబ్రహ్మమైన తానే దేహధారియై మూర్తీభవించి జీవరూపంబున తానుండి తాను తనమనస్సుతో పరబ్రహ్మమును జూడబోయిన సూర్యునిజూడబోయిన చీకటి తానేలేకపోయినట్లు తన్ను జూడబోయినమనసు తానేలేక పోవుచున్నది. కాబట్టి బ్రహ్మవిద్యార్థులైన ముముక్షువులు అవాఙ్మనస గోచరమైన బ్రహ్మము అనుభవైక వేద్యమని గ్రహించి తమశరీరమునందు ప్రజ్ఞామాత్రమైయున్న బ్రహ్మమును తమ ప్రజ్ఞచేతనే దర్శింపవలెనని తా॥

99. తిరిగి తిరిగి తిరిగి వేసారి వేసారి । తిరిగి తిరిగి తిరిగి దిమ్మదిరిగి । బొమ్మలాటవాని పోడిమిగంటిరా॥ వి॥ లోకంబున బ్రహ్మవిద్యాధురంధరుండైన వేమనయోగీంద్రుండు తన జీవన్ముక్తికొరకు దేవుని గుట్టును జీవునిమట్టును రెండును దెలియనేరక నానాదేశంబులు తిరిగి తిరిగి అనేకయోగంబుల నభ్యసించి అనేకమతంబులను పరిశీలించి రాజయోగానుభవంబెందువల్లను లభించక ప్రాణము విసికి వేసటజెంది తు

దకు సనాతన సహజాద్వైతసిద్ధాంతబ్రహ్మవిద్యానుభవ పరిపూర్ణుండైన పరమగురుని నిర్హేతుకజాయమాన కరుణా కటాక్షంబువలన జగన్నాటకసూత్రధారియైన దేవుని గుట్టుదెలసి జీవభ్రాన్తియను చిక్కువదలి స్వయంప్రకాశమానాఖండ సచ్చిదానంద పరిపూర్ణబ్రహ్మము తానై ప్రకాశించుచున్నట్లు యీగ్రంథమువలన తెలియబడుచున్నదనితా॥

100. శతసంఖ్య పద్యముల నేమతిమంతుడు పఠనజేయు మమతలు దీరున్ । అతడును శాశ్వతపదమును శితికంఠుని కరుణవడయు సిద్ధము వేమా॥ లోకంబున ముముక్షు జనకల్పవృక్షంబై ఆంధ్రవేద సూత్రభాష్యంబై అపరోక్షబ్రహ్మవిద్యానుభవంబైన యీవేమనశతకంబు నూరుపద్యంబులును బ్రహ్మసూత్రంబులని గ్రహించి యేబుద్ధిమంతులు భక్తిశ్రద్ధలతో పఠింతురో అట్టి పుణ్యాత్ములకు పరమేశ్వరానుగ్రహబలంబున ప్రకృతి ప్రతిబంధంబులు నివర్తించి పరమపదము సిద్ధించుచున్నదని తాత్పర్యము.

గద్య

ఇతి శ్రీ వేమన సద్గురు పరమేశ్వర కరుణాకటాక్ష లబ్ధ
బ్రహ్మవిద్యానుభవ గవర్రాజువంశపవిత్ర ఆత్రే
యసగోత్ర శ్రీ లక్ష్మణామాత్యపుత్ర
సూర్యనారాయణ శర్మణావిర
చిత శుద్ధాంధ్రవేదసూ
త్రభాష్యగ్రంధ



# గురుపూజా విధానము

అనాద్యవిద్యావాసనయా ప్రవర్తమానే అస్మిన్ సంసారచక్రే మమజన్మకర్మమూలాజ్ఞాననివృత్త్యర్థం బ్రహ్మాత్మసాక్షాత్కారసిద్ధ్యర్థం శ్రీసద్గురు దేవతాముద్దిశ్య శ్రీసద్గురు దేవతా ప్రీత్యర్థం ధ్యానమావాహనాదిషోడశోపచారపూజాంకరిష్యే॥ శ్లో॥ఆరాధయామి మణిసన్నిభమాత్మలింగం మాయాపురీహృదయ పంకజ సన్నివిష్టం। శ్రద్ధానదీ విమలచిత్త జలాభిషేకైః నిత్యంసమాధి కుసుమైర్న పునర్భవాయ॥సర్వపరిపూర్ణాయైనమః ఆవాహనంసమర్పయామి। సర్వాధారాయైనమః సింహాసనం సమర్పయామి। స్వచ్ఛాయైనమఃపాద్యమర్ఘ్యంస...మి। పరిశుద్ధాయైనమః ఆచమనీయం స...మి। అత్యంతనిర్మలాయైనమః అభిషేకం స...మి। విశ్వోదరాయైనమః వస్త్రయుగ్మం స...మి। వర్ణాశ్రమరహితాయైనమః యజ్ఞోపవీతం స...మి। నిర్లేపాయైనమః దివ్యశ్రీచందనం స...మి। నిర్విశేషాయైః అక్షతాన్ స...మి। నిరాకృతాయైనమః అలంకారం స...మి। వాసనారహితాయైనమః పుష్పాణి స...మి॥ ఓంగురవేనమః, ఓంపరమగురవేనమః, ఓంపరమేష్ఠిగురవేనమః, ఓంపరాపరగురవేనమః,ఓంశివాయైనమః, ఓం నిష్కళంకాయైనమః ఓంవ్యోమాతీతాయైనమః.ఓంనిరంజనాయైనమః. ఓంఅప్రతర్క్యాయైనమః ఓం అవిజ్ఞాయైనమః, ఓంజగత్కారణాయైనమః. ఓంఅప్రమేయాయైనమః ఓం అనంతాయైనమః. ఓంనిర్గుణాయైనమః. ఓంజ్ఞానజ్ఞేయాయైనమః.ఓం సూక్ష్మాయైనమః. ఓంశాంతాయైనమః. ఓంశుద్ధాయైనమః.ఓంకేవలాయైనమః. ఓంకైవల్యాయైనమః. ఓంఅద్వితీయాయైనమః. ఓంపరబ్రహ్మణేనమః నానావిధ పరిమళ పుష్పాణిసమర్పయామి। నిరంజనాయైనమఃధూపంసమర్పయామి। సర్వసాక్షిణ్యైనమః దీపం స...మి। నిత్యతృప్తాయైనమః నైవేద్యం స...మి। విశ్వానందప్రదాయైనమః తాం

బూలం స...మి। సూర్యచంద్రానల దీప్తయేనమః నీరాంజనంసమర్ప యామి। అనంతాపారరూపాయైనమః ప్రదక్షిణనమస్కారాన్ స...మి వేదవాచామ వేద్యాయైనమః స్తోత్రాణి స ... మి। బాహ్యాభ్యన్తరపరిపూర్ణాయైనమః ఉద్వాసనం స ... మి। అనేన ద్గురుపూజావిధానేన గురుపరమగురు పరమేష్ఠిగురు పరాపరగురు ప్రసాదసిద్ధిద్వారా ఆత్మానుభవ సిద్ధిర్భూయాత్॥ కృతార్థోస్మి। కృతార్థోస్మి కృతార్థోస్మి॥

శ్లో॥ అర్చనాద్వందనాత్ శిష్యో జీవన్ముక్తో భవేద్ధ్రువం। తస్మాత్ జ్ఞానేన సంపూజ్య గురుపాదోదకం పిబేత్॥

శ్లో॥ అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం। జ్ఞానవైరాగ్యదం పుంసాంగురోరుచ్ఛిష్టభోజనం॥ గురుపూజాసంపూర్ణము

అజపాగాయిత్రివిధానము.

కేశవాయస్వాహా ... ... శ్రీకృష్ణాయనమః॥ ఉత్తిష్ఠంతు ... శ్రీపరమేశ్వరముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థంఅద్యసూర్యోదయమారభ్య పునస్సూర్యోదయ పర్యంతం జాగ్రత్స్వప్న సుషుప్తిషు మూలాధారస్వాధిష్ఠాన మణిపూరక అనాహతవిశుద్ధ ఆజ్ఞేయబ్రహ్మగ్రంధిస్థితేభ్యః। గణపతిబ్రహ్మవిష్ణు మహేశ్వరసదాశివగురుపరమాత్మనః॥ షట్ శతాధిక ఏవింశతి సహస్రిసంఖ్యా అజపాగాయిత్రి మంత్రజపమహం కరిష్యే।శ్లో॥ గురుబ్రహ్మ... ...శ్రీగురవేనమః॥ అస్యశ్రీ అజపాగాయత్రీమహామంత్రస్య హంసఋషిః।అవ్యక్తగాయిత్రీఛందః। ముఖేపరమహంస పరమాత్మాదేవతా।అహంబీజం।నాభౌసహాశక్తిః పాదయోః సోహం కీలకం। సర్వాంగాణి జ్ఞానసిద్ధ్యర్థం అజపాగాయిత్రీజపేవినియోగః।హాం సః అంగుష్ఠాభ్యాంనమః। హాంసీంతర్జనీభ్యాంనమః। హాంసూంమధ్యమాభ్యాంనమః। హాంసైంఅనామికాభ్యాంనమః । హాంసౌంకనిష్ఠికాభ్యాం నమః। హాంసఃకరతలకరపృష్ఠాభ్యాంనమః॥ హాంసఃహృదయాయనమః। హాంసీంశిరసేస్వాహా।హాంసూంశిఖాయైవషట్।హాంసైంకవచాయహుం। హాంసౌంనేత్రత్రయాయవౌషట్। హాంసఃఅస్త్రాయఫట్। ధ్యానం॥ హాంసోగణేశోవిధిరేవహంస హరిస్తుహంస।హంసశ్చశంభుః। హంసస్తుజీవో గు

తు రేవహంస ఆత్మాదిహంస।పరమాత్మహంసః॥ హకారేణ బహిర్యాతి సకారేణవిశేత్పునః। హంసహంసేతియో బ్రూయాత్ జీవ్రోజపతిసర్వదా॥ షట్శతంగణనాథస్య। షట్సహస్రంప్రజాపతేః. షట్సహస్రంగదాపాణే, షట్సహస్రంపినాకినః। ఆత్మనః ద్విసహస్రంతు గురురేవసహస్రకం పరబ్రహ్మసమాయుక్తమర్పయామికృతంజపం॥ శ్లో॥ మూలాధారంగుదస్థానం స్వాధిష్ఠానంతు మేహనం। నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జమనాహతం। తాలుమూలవిశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యనిటలాంబుజం। సహస్రారంబ్రహ్మరంధ్రమిత్యాగ మవిదోవిదుః॥ శ్లో॥ఆధారేలింగనాభౌ ప్రకటిత హృదయేతాలుమూలేలలాటే। ద్వేపత్రే షోడశారే ద్విదళదళదళే ద్వాదశారే చతుష్కే। వాసాంతే బాలమధ్యే ఢఫకఠసహితే, కంఠదేశేస్వరాణాం। హంక్షంతత్వార్థయుక్తం సకలదళయుతం వర్ణరూపం నమామి॥

పంచపూజా

లం, పృథివీ తత్వాత్మనే గంధం సమర్పయామి। హం, ఆకాశతత్వాత్మనే పుష్పం స ... మి। యం, వాయుతత్వాత్మనే ధూపంస ... మి రం, వహ్నితత్వాత్మనే దీపంస...మి। వం, అమృతతత్వాత్మనే అమృత నైవేద్యం స ... మి। సం, సర్వతత్వాత్మనే తాంబూలాది సర్వోపచారాన్ సమర్పయామి॥ మూలమంత్రం॥సోహం, హంసః, హంసస్సోహం॥

అజపాగాయత్రీ సంపూర్ణము

లోకంబున సత్యాతుర ముముక్షువులైన మానవులు గురుపూజావిధానమున్ను, అజపాగాయిత్రీవిధానమున్ను, సద్గురూపదేశమూలముగా సంగ్రహించి, విధ్యుక్తముగా నుపాసించి అజపాగాయత్రీరూపమైన జీవహంసను జగద్గురుపరబ్రహ్మమైన పరమహంసయందైక్యపరచి జగన్నాటక మర్మమును గ్రహింతురు గాక. అందుకు తగినభక్తిశ్రద్ధలుజగదీశ్వరుడు మీకిచ్చి రక్షించుగాక.

# ప్రకటన

జగన్నాటక విలాసమను నీమోక్షగ్రంథము లోకంబున కల్ప వృక్షమువలె నుద్భవించి సర్వమత ముముక్షువులకును జీవన్ముక్తి ఫలముల ను సిద్ధింపజేయుచున్నది. కనుక సర్వమత సమ్మతమైన యీమోక్ష గ్రంథమును సర్వదేశీయులును స్వభాషలో మార్చికొని భక్తి శ్రద్ధలతో బఠించిన బ్రహ్మవిద్యారహస్యము బయలుబడగలదు.

ఈజగన్నాటక విలాసమున్ను యిదివరలో రచింపబడిన విదేహకై వల్యమున్ను అనుభవదర్పణము, సతీవ హితోపదేశము నను నాలుగు గ్రంథములహక్కున్ను లోకంబున ముముక్షువుల కొరకు భగవదర్పణ ము చేయబడినది.

కావున లోకంబున ధర్మాత్ములు యీగ్రంథముల హక్కు నప హరింపక భగవత్ప్రీతిగా ప్రచురించి వ్యాపింపజేయ గోరుచున్నాడను. ఈగ్రంథములు వలయువారు—

మః రాః రాః శ్రీ ఎర్రమిల్లి వెంకటబంగారాజుగారు

పాశర్లపూడి, నగరంతాలూకా,

గోదావరిజిల్లా. అనివ్రాయవలయును.